# The Andhra Legislative Assembly

**Tuesday, 31st January 1956.**

The House met in the Assembly Hall, Kurnool, at One of the Clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshmi-Narasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS

### Starred Questions.

Foodgrains given to Central Government.

**226—**

* 63 Q.—Sri S. VEMAYYA:—

Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government gave any stocks of food-grains to the Government of India in the year 1955 so far; and

(b) if so, the quantity and quality of the same?

The Hon. Dr. B. GOPALA REDDI:—

(a) Yes.

(b) The quantities supplied during 1955 upto the end of May, are 7,599 tons of 1st sort rice and 15,765 tons of IInd sort rice.

Sri S. VEMAYYA:—

ఈ export చేయడములో ఏవిధమైనటువంటి విలంబనలు జరుగుతున్నాయి? దీనిని త్వరగా export చేయడానికి మనప్రభుత్వము ఏమి చర్యలు తీసుకొన్నది?

The Hon. Dr. B. GOPALA REDDI:—

De-control order అయిపోయిన తరువాత మనకు కొన్ని stocks ఉన్నాయి. అందులోనుంచి మన Government of India వారు కొంత export చేయించినారు. కొంత Central Stores వాళ్లు తీసుకొన్నారు. అందువల్ల కొంత విలంబన జరిగింది.

31st January 1956.

Sri B. SANKARAYYA:—

Central Stores కు సకాలములో ఇవ్వకపోవడం పంటలు పండినప్పుడు ధరలు తగ్గిపోవడము, తరువాత పంటలువచ్చే సమయములో దానిని release చేసి నందువల్ల ముందుగా ధరలు పెరగడము జరుగుతున్నది. ఈ విధంగా జరగడమువల్ల చిన్న చిన్న రైతులకు నష్టము కలుగుతున్నది. ఇకమీదట రాకుండా చూసేదానికి చర్యలు తీసుకుంటారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

Control, De-control ఉన్నప్పుడు అటువంటివి నష్టము రాకుండా చూస్తాము.

Sri V. VISWESWARA RAO:—

అధ్యక్షా, Central Government food banks విషయము వచ్చినప్పుడు ధాన్యము విషయము మాత్రమే చూస్తుంది. జొన్నలకుకూడా ధరలు తగ్గిపోతున్నాయి కాబట్టి దానినికూడా నిలువచేయడానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఇదిఅంతా కూడా కేంద్రప్రభుత్వమువారు consider చేస్తున్నారు. ఈ ధరల కంట్రోలుకు ఒక కమిటీని వేసినారు. వారు దీనిని గురించి చూస్తారు.

Sri B. SANKARAYYA:—

ఇప్పుడు Control, De-control విషయము కాదు. ఒక minimum price ఉండడానికి మన Provincial Government దానిని తీసుకుంటుందా? మామూలులో minimum price ఉండడము లేదు. ఒకపర్యాయము తరిగి తరువాత ధరలు పెరుగుతున్నాయి. అందువల్ల దానిని మనము Central Government కు ఇచ్చేప్పుడు ముందుగానే తగిన జాగ్రత్త తీసుకొంటే ఇటువంటివి ఉండవు.

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఆ కమిటీవారు అన్ని ప్రదేశాలు తిరుగుతున్నారు. తప్పకుండా వారు ఈ విషయాన్ని ఆలోచిస్తారు.

Sri PRAGADA KOTAIAH:—

Central Government ఇచ్చిన stocks ఏధరకు కొన్నారు, ఏధరకు ఇచ్చినారు. దానివల్ల ప్రభుత్వానికి లాభము ఏమైనా వచ్చిందా?

31st January 1956.

The Hon. Dr. B. GOPALA REDDI.—

లాభము రాలేదు. Millers కు చాలా నష్టంవచ్చింది. చాలా కాలంవరకు బియ్యం ఎగుమతికాకుండా వాళ్ల stocks అంతా నిలచిఉన్నాయి. చివరకు మణుగు 1 కి రు 2–6–0 వంతున వాళ్లకు compensation ఇచ్చి ఆ stock అంతాకూడా విడుదలచేయడానికి కేంద్రప్రభుత్వంవారు నిశ్చయించారు. ఏధరకు కొని ఏధరకు అమ్మారలో ఇక్కడ information లేదు.

Sri L. LAKSHMANA DASS·—

అధ్యక్షా, ఇప్పుడు ఉన్న ధాన్యంధరకన్నా ఇతరవస్తువుల ధరలు చాలా విపరీతంగా ఉన్నాయి. ధాన్యాల ధరలు రోజురోజుకు ఇంకా పడిపోతున్నాయి. ప్రభుత్వం దానికి minimum rate ను ఇతరవిషయాలను దృష్టిలో పెట్టుకొని నిర్ణయము చేస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

Government of India వారు ఒక కమిటీని వేసినారు. వారు దేశము అంతా తిరుగుతున్నారు. ఈ విషయముకూడా దర్యాప్తు చేస్తారు.

Sri PILLALAMARRI VENKATESWARLU:—

Millers కు ఎందువల్ల నష్టం వచ్చింది?

The Hon. Dr. B. GOPALA REDDI:—

వాళ్లు ధరపెట్టి కొన్నారు. కొన్ని మాసములవరకు సరుకు విడుదలకాకుండా ఉండిపోయింది. నాలుగు మాసములవరకు వాళ్లకు గోడౌన్సు అద్దెలు వగైరాలలో నష్టము వచ్చింది.

Sri S. NARAYANAPPA:—

ఈ stocks కొన్నటువంటి millers ఎంతమంది ఉన్నారు? ఎవరెవరికి ఎంతెంత నష్టము వచ్చిందో వివరాలు తెలియజేస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

అంతా కేంద్రప్రభుత్వమువారే ఇచ్చినారు. మనకు సంబంధము లేదు.

Sri S. VEMAYYA:—

అధ్యక్షా ఇప్పుడు millers వద్ద ఈ stocks విడుదలకాకుండా పోవడము వల్ల నష్టంవచ్చింది. దానిని పూడ్చుకొనడానికి ప్రభుత్వం ఏమైనా వారికి సహాయము చేసి revenue ఏమైనా పోగొట్టుకొన్నారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

మన ప్రభుత్వము ఏమీ పోగొట్టుకొనలేదు. కేంద్రప్రభుత్వమువారు మణుగు 1 కి రు 2–6–0. నష్టపరిహారం ఇచ్చినారు.

31st January 1956.

Number of irrigation works handed over to the Revenue Department by the Public Works Department.

**227—**

* 84 Q.—Sri S. VEMAYYA:—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state the number of irrigation works handed over to the Revenue Department by the Public Works Department after completion of repairs for (a) the year ending 1953; and (b) 1954 ?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

The number of Irrigation works handed over to the Revenue Department by the Public Works Department after completion of repairs during the years 1953 and 1954 was 331 & 179 respectively.

Sri S. VEMAYYA:—

ఏఏ జిల్లాలలో ఎన్నెన్ని works ఇచ్చినారు. వాటి works అన్నికూడా పూర్తిగా complete చేసి, లేక సగము పూర్తిచేసి department కు అందచేసారు. వివరములు తెలుపుతారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

Complete చేసినట్లే మేము భావించుకుంటున్నాము. Incomplete గా ఇచ్చిఉంటే ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరమే వచ్చిఉండేది కాదు. ఈ జిల్లాలో ఎన్ని ఇచ్చారంటే:

| | 1953 | 1954 |
|---|---|---|
| శ్రీకాకుళం | 6 | 10 |
| విశాఖపట్టణము | 16 | 1 |
| తూర్పు గోదావరి | 22 | — |
| పశ్చిమ గోదావరి | 20 | 6 |
| కృష్ణా | 53 | 14 |
| గుంటూరు | 9 | 5 |
| నెల్లూరు | 91 | 16 |
| కడప | 56 | 13 |
| చిత్తూరు | 51 | 128 |
| కర్నూలు | 1 | — |

ఇచ్చారు.

31st January 1956.

Encroachments on Highways Road side near Ponnur bus stand.

**228—**

* 277 Q.—Sri PRAGADA KOTAIAH:—

Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether the public of Ponnur in Guntur district have represented to the Highways and Revenue Authorities requesting them for the removal of encroachments on the Highways Road side near the Ponnur bus stand;

(b) whether the Highways authorities or the Collector, Guntur, have issued licences for the said encroachments; and

(c) if not, the action that the Government propose to take for evicting these encroachments ?

The Hon. Sri K. CHANDRAMOULI:—

(a) The answer is in the affirmative.

(b) and (c) only one encroachment on the Highways Road Poramboke of Nidubrole (village) which is an approach to the petrol bunk in the locality was licenced in F. 1363 and renewed for 3 years from F. 1364. Action is being taken by the Collector, to evict all the objectionable encroachments in the remaining cases.

Conversion of primary schools into Basic schools in National Extension Service Block Areas.

**229—**

* 276 Q.—Sri PRAGADA KOTAIAH:—

Will the Hon. Minister for Planning and Industries be pleased to state—

(a) whether it is a fact that the Government of India have asked the State Governments to convert the present primary schools into Basic schools in National Extension Service Block areas; and

(b) if so, whether the present primary schools in National Extension Service Blocks have been converted into Basic schools and if not the reasons for the same ?

The Hon. Sri K. VENKATA RAO:—

(a) The Community Projects Administration have emphasised that Basic Education should be the sheet anchor of future policy

31st January 1956.

in Primary and Secondary Schools in Community Projects, Community Development and National Extension Service areas.

(b) Steps are being and will be taken to see that all schools are of the basic type or have a craft bias.

Community Project, Community Development Scheme, National Extension Scheme ప్రదేశాల్లో ఈ పునాది విద్యావిధానాన్ని ప్రవేశపెట్టవలసిందని Community Project Administrators కు ఇదివరకే తెలియపరచారు. ఇటువంటి గ్రామవిధానాన్ని అమలుపెట్టే విషయమై ప్రభుత్వం పూర్తిగా కృషి చేస్తున్నది.

Sri PRAGADA KOTAIAH:—

అధ్యక్షా, ఇంతవరకు ఈ primary schools ను basic schools గా convert చేయకపోవడానికి కారణములు ఏమిటో వివరిస్తారా?

The Hon. Sri K. VENKATA RAO:—

ఇక్కడ కారణాలు 10 వ్రాశారు. చదువుటకు 10 నిమిషములు పడుతుంది. చదవమంటే, చదువుతాను.

Mr. Speaker:—

క్లుప్తంగా చెప్పండి.

The Hon. Sri K. VENKATA RAO:—

(1) Basic Schools లో విద్యార్థికిగాను, విద్యార్థినికిగాను 135 చదరపు అడుగుల స్థలము ఇవ్వాల్సిన అవసరము ఉన్నది. అక్కడ ఇంత స్థలము ఉన్న ప్రదేశాలు లభించకపోవడంవల్ల.

(2) వ్యవసాయానికి, తోటలు పెంచడానికి కావలసిన ప్రదేశాలు గ్రామాలలో ఉండటము చాలా కష్టము అవడమువల్ల.

(3) గ్రామాలలో చాలాచోట్ల సరిపోయినటువంటి ఇంజనీర్లు లేకపోవడము.

(4) Non-Basic Teachers ఎక్కువమంది తయారుఅవడం, basic విద్య చదువుకొన్నవారు తక్కువమంది ఉండడమువల్ల.

(5) వృత్తి విద్యకు సరిపోయినటువంటి సరకులు వగైరాలు సంపాదించుకోవడము దాంట్లో training ఇవ్వడము చాలా కష్టము అవడమువల్ల.

ఇలాగే చాలా వున్నాయి. వీటన్నింటిని చూచుకొని ఈ basic విద్యకు కమ్యూనిటీ ప్రాజెక్టుల స్థలములో Secondary schools లోను, Primary schools లోనుకూడా, ఇంక non-basic వాళ్లు అసలు లేకుండాచేసి ఇంకొకటి పెట్టేవిషయము ప్రభుత్వము చర్యతీసుకుంటుంది.

31st January 1956.

Sri T. JIYAR DASS.—

అధ్యక్షా, ఈ basic విద్యఅంటే మూలవిద్య అంటారు. విద్యాశాఖాధికారులకు ఈ విద్యయందు అభిమానము లేదని ప్రభుత్వానికి తెలుసునా?

The Hon. Sri K. VENKATA RAO —

నాకు తెలిసినంతవరకు లేదు.

ఉద్యోగస్థులు అన్నతరువాత గవర్నమెంటువారు నిర్ణయము చేయవలసిన బాధ్యత వారిపై ఉన్నది. ఈ మూలవిద్య ప్రోత్సాహంకోసము, వ్యాప్తికోసము ప్రభుత్వము నిర్ణయించినతరువాత ఏ అధికారిఅయినా దానికి వ్యతిరేకంగా ఉండడానికి వీలులేదు.

Sri N. SRINIVASA RAO.—

అధ్యక్షా, మంత్రిగారు చాలా కారణాలు ఇచ్చారు. కనీసం మంత్రివర్గపు ప్రతినిధిగాని, మంత్రివర్గమువారుగాని మా జిల్లాలో ఎక్కువ సంచారంచేయడం జరగలేదు. కనీసము మంత్రిగారు చూచినటువంటి అనుకూలమైన వాతావరణము ఉన్నచోట్లనైన ఎక్కువ basic schools పెట్టడానికి ప్రయత్నిస్తారా?

The Hon. Sri K. VENKATA RAO:—

నేను చూచినచోట్ల అనుకూల వాతావరణము ఉన్నది. నేను చూడనిచోట్ల ఎట్లున్నదో నాకు తెలియదు. అక్కడ ప్రోత్సహించడానికి నిర్ణయించాము. వీరి జిల్లాకు వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు అక్కడకూడ ప్రోత్సాహము చేస్తాము.

Sri G. YELLAMANDA REDDI:—

అధ్యక్షా, ఈ basic schools ఏర్పాటుచేసే సందర్భంలో, ఇంతకుముందు ఉన్న teachers విషయము ఏమి చేస్తుంది ప్రభుత్వము? వారు non-basic గా training అయినారుకదా! వారికేదైనా తర్ఫీదు ఇప్పిస్తుందా? లేక మరేమిచేస్తుంది?

The Hon. Sri K. VENKATA RAO.—

వారికి తర్ఫీదు ఇస్తున్నాము. ఎవరైనా తప్పిపోతే, విదేశీవస్త్రాలను బహిష్కరించినప్పుడు వాటికి ఏగతి పట్టిందో వారికీ అదేగతి పడుతుంది.

Extension of electricity from Naidupeta to certain villages in Nellore district.

**230** –

* 327 Q.—Sri M. MUNUSWAMI:—

Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

31st January 1956.

(a) whether there is any proposal to extend electricity from Naidupeta to Yakasiri and Annamedu villages and Thummur and Vinnamala of Naidupet Panchayat in Sulurpet taluk, Nellore district; and

(b) if so, when ?

The Hon. Sri G. LATCHANNA·—

(a) and (b) The feasibility of extension of supply to Yakasiri and Annamedu has been programmed for investigation in 1956–57. As regards extension of supply to Thummur and Vinnamala, a proposal costing Rs. 56,900 is under the examination of the Chief Engineer (Electricity) and will be sanctioned by him if it is found to be remunerative.

యాకసెరి, అన్నమేడు గ్రామాలకు విద్యుచ్ఛక్తి విస్తరణ పరిశీలన 1956-57 లో జరుగగలదు. తుమ్మూరు, విన్నమాల గ్రామాలయొక్క విద్యుచ్ఛక్తి సరఫరాకు గాను 56,900 రూపాయల విలువగలిగిన ఒక స్కీము ఇప్పుడు Chief Engineer గారు పరిశీలన చేస్తున్నారు. ఆ పరిశీలన త్వరలోనే పూర్తికాగలదు.

Sri M. MUNUSWAMI —

అధ్యక్షా, నాయుడుపేటకు electricity sanction అయిపోయి అక్కడ విద్యుచ్ఛక్తి సరఫరా కూడా అవుతున్నప్పుడు దానికి చేరినటువంటి తుమ్మూరు, విన్నమాల అనే ఈ రెండు గ్రామాలను మాత్రము ఎందుకు exclude చేయవలసి వచ్చిందో చెప్పుతారా ?

The Hon. Sri G. LATCHANNA:—

మొట్టమొదట వచ్చిన proposals బట్టి schemes తయారుఅవుతాయి. మొట్టమొదట proposals లో ఇది లేనందువలన దీనిమీద scheme work out కాలేదు. ఇప్పుడే ఈ proposal వచ్చింది, work out అవుతున్నది.

Sri S. RANGANATHA MUDALIAR:—

Does the Hon Minister know that there is a part of the country called Ramakrishnarajupet constituency, and has the Government any intention of extending electricity into that area in the near future.

Mr. Speaker:—

It is an aspersion against the Minister, Mr. MUDALIAR You must be sure that he does not know the constituency.

31st January 1956.

The Hon. Sri G. LATCHANNA:—

మన రాష్ట్రములో అటువంటి ప్రాంతము ఉన్నదనే కాకుండా, ఆ ప్రాంతము నుండి వచ్చిన ప్రతినిధికూడ ఇక్కడ ఉన్నారని నాకు తెలుసు. అయితే దాన్ని గురించి వేరే ప్రశ్న వేస్తే పూర్తిభోగట్టా తెలుపబడుతుంది.

## Basic Training Schools in the State.

**231—**

* 69 Q.—Sri S. VEMAYYA:—

Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the number of Basic Training Schools in the State now and the number of students undergoing training in them; and

(b) the extra expenditure to the State, if any, for 1954–55 ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

(a) 23 out of which 2 are located in Bellary. 2702 students, excluding those in the 3 Basic Training Colleges opened this year.

(b) It is presumed the member requires the total expenditure incurred on these schools in 1954–55. It is Rs. 9,02,365/-.

Sri S. VEMAYYA:—

సాధారణమైనటువంటి Training Schools కంటె, Basic Training Schools కు ఏదైనా extra expenditure involve అవుతుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

అవుతుంది. It is Rs. 9,02,365/-.

Sri S. RANGANATHA MUDALIAR:—

Will the Government take over the Tamil Training School at Prodduturpeta and convert it into a Basic Training school for Tamilians.

The Hon. Dr. B. GOPALA REDDI:—

A separate question might be put.

## Mahajar petitions from Munagala Paragana Rytu Sangham.

**232—**

* 255 Q.—Sri V. VISWESWARA RAO:—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

31st January 1956.

(a) whether the Government have received mahajar petitions from the Munagala Paragana Rytu Sangham for the formation of new canals from the Madhavaram tank to feed other tanks of Munagala Paragana; and

(b) if so, the action taken thereon?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

(a) Yes.

(b) The matter is receiving the attention of the Government.

Sri V. VISWESWARA RAO:—

ఇది చాలాకాలమునుంచి మంత్రిగారికి represent చేయడం జరుగుతూ ఉన్నది. ఎప్పుడు కూడ ఇది పరిశీలనలో ఉన్నది అని మంత్రివర్గము చెప్పడము జరుగుతూ యున్నది. కాబట్టి దీనిని వెంటనే పరిశీలించి నిర్ణయము చేస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

ప్రభుత్వముయొక్క దృష్టిలో ఇది ఒక్కటేఉంటే, తప్పకుండా చేసిఉందుము. కాని ఆలాంటివి అనేక వందలకొలది, వేలకొలది ఉన్నాయనేది మిత్రునికి తెలుసు. అన్నిటిలో ఏదానికి priority వస్తుందా అనేది point. ఈ constituency ని మరచిపోలేదు. ఇప్పటి కిప్పుడే 42 tanks repair అయినాయి. వీటికిమాత్రము నాగార్జునసాగర్ నీళ్లేమైనా వస్తాయా లేదా అని తెలుసుకొని తరువాత డబ్బు ఖర్చు పెట్టాలిగాని, పరిశీలన చేస్తూనే అన్ని sanction చేస్తామా ఎక్కడైనా?

*Appointment of Tahsildars in the State.*

**233—**

* 338 Q.—Sri S. VEMAYYA:—

Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether the Government have received Memorandum No. 45/54, dated 12th March 1954 from (M.L. As.) S. Vemayya and B. Appalaswamy regarding the appointment of Tahsildars in the State in proportion to the seats reserved for Harijans and Backward Communities in Services; and

(b) if so, the action taken thereon?

31st January 1956.

The Hon. Sri K. CHANDRAMOULI:—

(a) The answer is in the negative.

(b) Does not arise.

Sri S. VEMAYYA:—

1954 సంవత్సరంలో అప్పుడు ముఖ్యమంత్రిగారికి ఇచ్చాము. దానికి acknowledgment కూడ వచ్చింది. కాని అటువంటివి రాలేదని చెప్పడంలో నాకు సందేహము వస్తున్నది. దరిమిలా దర్యాప్తు చేసి దాని result తెలియచేయు డానికి పూనుకొంటారా ?

The Hon. Sri K. CHANDRAMOULI:—

పాత record లో ఎక్కడైనా ఉన్నదేమోగాని, ఇప్పుడు పరిశోధించినంత వరకు ఏ record లోను, ఎక్కడా, ఏమీ కన్పడలేదు.

Sri PILLALAMARRI VENKATESWARLU:—

పాత records చూడకుండానే "the answer is in the negative" అని చెప్పారా ?

The Hon. Sri K. CHANDRAMOULI:—

చూశాము. పరిశోధించినంతవరకు ఎక్కడా కన్పడలేదు అని చెప్పినమాటలు మరచిపోకూడదు వెంకటేశ్వర్లు.

Sri PILLALAMARRI VENKATESWARLU:—

"పాత record లో ఉన్నదేమోగాని" అనేమాట వారు చెప్పారు. అందుకని అడుగుతున్నాను.

No reply.

*Sanitary Inspector Course at Guntur Medical College.*

**234—**

* 355 Q.—Sri VAVILALA GOPALAKRISHNAYYA:—

Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether it is a fact that the Sanitary Inspectors' Course was started at Guntur Medical College with effect from July 1955; and

31st January 1956.

(b) if so, what is the strength now?

The Hon. Sri K. VENKATA RAO:—

(a) Yes, Sir.

(b) The strength of the students undergoing the course is 50.

(అ) అవును.

(బ) 55 మంది విద్యార్థులు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—

అధ్యక్షా, ఇప్పుడున్న పరిస్థితులలో చాలా ఎక్కువమంది engineering students కావలసి వస్తున్నారు. అందుకని వారి strength ఎక్కువ చేయడానికి ప్రయత్నిస్తారా?

The Hon. Sri K . VENKTA RAO:—

రేపు budget pass అయి మాకు కావలసిన డబ్బుఅంతా ఇస్తే ఆలోచించడం జరుగుతుంది.

*Extension of electric power to Netrapally, etc. villages.*

**235—**

* 471 Q.—Sri N. C. SESHADRI:—

Will the Hon. the Minister for Electricity and Social Well fare be pleased to state—

(a) whether the schemes for extension of electric power to Netrapally and surrounding villages and Pallepally and surrounding villages have been submitted to the Government about three months back; and

(b) if so, the action taken thereon?

The Hon. Sri G. LATCHANNA:—

(a) Yes.

(b) As the schemes are not remunerative, the Chief Engineer (Electricity) has been asked to evolve remunerative proposals by canvassing more loads, if possible.

ఈ ప్రణాళికలు లాభదాయకము గాకుండుటచే, మరికొన్ని సర్వీసు కనెక్షనుల కొరకు ప్రయత్నించి, వీలగుచో లాభదాయకమగు ప్రణాళికలను తయారుచేయవలసినదిగా చీఫు యింజనీరు గారిని అడగడమైనది.

31st January 1956.

Sri N. C. SESHADRI:—

ఈ additional loads canvass చేయడానికిగాను షుమారు రెండు నెలల క్రిందట Chief Engineer కు పంపించినప్పటికి, ఇదివరకుకూడ వారికి వచ్చినట్లు తెలియడంలేదు. కాబట్టి ప్రభుత్వమువారు ఈ విషయంలో ఏమాత్రం జాగుచేయకుండా త్వరత్వరగా ఈ స్కీములు అమలుపరచేటట్లు చూస్తారా ?

The Hon. Sri G. LATCHANNA:—

రెండు రోజులలో Chief Engineer గారు వస్తున్నారు. అప్పుడు వారికి ఇది తప్పకుండా హెచ్చరిస్తాము.

Sri SHEIK MOULA SAHIB:—

అధ్యక్షా, ఈ రాష్ట్రములో మొత్తముమీద ఎన్ని కపిలభావులకు, వ్యవసాయానికిగాను, electricity supply చేసినారు? 1955-56 సంవత్సరంలో ఎన్ని భావులకు current ఇవ్వబోతున్నారు ?

Mr. SPEAKER:—

ఇది భావులగురించి కాదు.

Sri C. SUBBARAYUDU:—

అధ్యక్షా, ఈ additional work కు గాను, ఇంతకుముందు estimate వేసినటువంటివి అనంతపురము జిల్లాలో చాలా వాపసు పంపించినారు. 11 per cent నుంచి 10 per cent కు తగ్గించినా, contingencies క్రింద 3 per cent నుంచి 5 per cent కు పెంచిన కారణంచేత, ఆ percentage తగ్గించినా, additional board వచ్చినదానివల్ల ప్రతిబంధకంగా ఉంటుందని మంత్రిగారికి తెలుసా? తెలిస్తే దానిపైన ఏమిచర్య తీసుకొంటారు?

The Hon. Sri G. LATCHANNA:—

ఈ contingency percentage జరుగుతున్న ఖర్చులలో వచ్చిన తేడాలను బట్టి మారిందిగాని దీనివల్ల మారింది కాదు. పూర్వము 3 per cent ఉన్నమాట వాస్తవమే. ఇప్పుడు ఖర్చులు, ఇతర పరికరాల ధరలు పెరిగినందువలన contingencies అనేది 5 per cent కు పెంచడం జరిగింది. అందుచేత 10 per cent criterion అనేది పూర్వపు విధానమే ఇప్పుడుకూడ అవలంబిస్తున్నది.

Sri P. SREERAMULU:—

డిపార్టుమెంటువారు పరిశీలనచేసి లాభదాయకముగా నిరూపింపబడినటువంటి స్కీములు ప్రభుత్వమునకు వచ్చాయి. అలాంటి స్కీములు త్వరగా అమలుజరిగేటట్లు ప్రభుత్వము పూనుకొంటుందా ?

31st January 1956.

The Hon. Sri G. LATCHANNA:—

పూనుకొనడమే కాదు. త్వరగా చేస్తుంది కూడాను.

Sri N. C. SESHADRI:—

అధ్యక్షా, ఈ contingencies 3 per cent నుంచి 5 per cent కు raise చేసింది ఇటీవల జరిగిన విషయము. అయితే raise చేయడానికిముందు submit చేసినటువంటి స్కీముసైనా ఈ 5 per cent అనేది లేకుండా త్వరగా sanction చేయడానికి ప్రయత్నిస్తారా ?

The Hon. Sri G. LATCHANNA:—

Contingencies అనే విధానముస్కీము estimation కు సంబంధించింది గాని ప్రభుత్వముయొక్క policy కి సంబంధించింది కాదు. ఇది engineering యొక్క విధానానికి, దానియొక్క ఖర్చుల పద్ధతికి సంబంధించినది. ఆ 5 per cent అనే contingency percentage లేనప్పుడు స్కీమును work చేయడానికే ఇబ్బంది కలుగుతుంది.

Sri N. SRINIVASA RAO:—

Electricity supply చేయడంలో backward communities కు preference ఇచ్చినట్లు, backward areas కు preference ఇస్తారా ?

The Hon. Sri G. LATCHANNA:—

ప్రథమ శాసనసభలోనే ఇది ప్రకటించడమయింది.

Sri B. SANKARAIAH:—

ఈ స్కీములు పూర్తిచేయడంలో material లేక చాలా ఆలస్యం జరుగుతున్నది. కనుక దీన్ని వెంటనే తెప్పించడానికి ప్రయత్నిస్తారా ?

The Hon. Sri G. LATCHANNA:—

ఈ material ఇప్పుడు కావలసినంత ఉన్నది. సరఫరా చేస్తున్నాము.

Sri C. SUBBARAYUDU:—

ఇప్పుడు contingencies క్రింద రెండు పరసెంటు పెరిగిన కారణముచేత, return కూడ తగ్గిపోవటం తటస్థిస్తున్నది. మొత్తముమీద length జాస్తిఅయినప్పుడు, cost పైనకూడ తగ్గుతుంది కాబట్టి అటువంటి ప్రతిబంధకము లేకుండా యిది పది పరసెంటుకు తగ్గించినవాటికి అటువంటివి ఏవైనా వస్తే, వాటిని లెక్కపెట్టకుండా శాంక్షను చేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA:—

Return అయినటువంటి ఖర్చుకున్ను, వచ్చిన ఆదాయముమీద వున్నటువంటి తేడాలకు సంబంధించి ఉన్నది. అందుచేత పెరుగుతున్న ఖర్చుకు సరిపోయే ఆదాయము భూపించవలసిందిగా కాంగ్రెసు సభ్యులను, అధికార్లనుకూడా యీ ప్రభుత్వముయొక్క డిపార్టుమెంటు కూడ ప్రయత్నము చేస్తున్నది.

31st January 1956.

*Scholarships granted to students in 1954*

**236—**

* 72 Q.—Sri S. VEMAYYA:—

Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the number of students in (i) Government Colleges, (ii) High schools, and (iii) elementary schools to whom scholarships were granted for the year 1954; and

(b) the amount of money paid in the matter?

The Hon. Dr. B. GOPALA REDDI:—

(a) and (b) It is presumed that the member wants particulars for the year 1954-55.

The number of scholarships granted to students in Government Colleges, High Schools and Elementary Schools in 1954-55 and the amount paid are as follows:—

| | | | |
|---|---|---|---|
| (i) | Government Colleges | 590 | Rs. 1,69,464/- |
| (ii) | High Schools (Govt. & Non-Govt.) | 4305 | Rs. 1,67,768/- |
| (iii) | Higher and Elementary Schools (Govt. and Non-Government.) | 1009 | Rs. 14,198-8-0 |

Sri S. VEMAYYA:—

ఈ Scholarships ను మంజూరు చేయడములో ఎక్కువగా ఆలస్యము జరుగుచున్నది. కనీసము ఒక సంవత్సరము గడచిపోయి జనవరినెల వచ్చినప్పటికినీ, యింకా కొన్ని నిలబడడము జరుగుతున్నది. అలాంటప్పుడు దానికి ఒక time limit పెట్టి, వచ్చిన దరఖాస్తులన్నీ మంజూరుచేసి, వారికి scholarships యివ్వటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

సభ్యులు అడిగిన ప్రశ్న Director of Public Instruction కు గాని, Director of Social Welfare కు గాని, దేనికి సంబంధించినదిన్నీ తెలియలేదు. ఏది అయినప్పటికిన్నీ ఆలస్యము లేకుండా చేయటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుంది.

Sri S. KASI REDDI:—

అధ్యక్షా, విద్యార్థులు చాలామంది డబ్బులేకుండా ఉన్న కారణముచేత ఫీజు చెల్లించలేకుండా ఉన్నారు. మనదేశములో బాగా చదువుకున్నవారు అవసరము

31st January 1956.

కాబట్టి, రాబోయే పంచవర్ష ప్రణాళికలు అభివృద్ధిపరచుకోవాలంటే అటువంటివారికి వెంటనే scholarships యివ్వటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

Scholarships ప్రభుత్వము యివ్వటము ఉత్తమోత్తమమైన విషయమే కాని, ప్రస్తుతము ఆర్థికలోపమువల్ల అందరికి యివ్వలేకుండా పోతున్నది.

Sri S. NARAYANAPPA:—

కాలేజీలలో చదువుతున్న వెనుకబడినజాతికి చెందిన విద్యార్థులకు scholarships చాలామందికి మంజూరు కాలేదు. వారందరు వేతనాలు చెల్లించలేక పలు విధములుగా యిబ్బంది పడుతున్నారు. ఈ విషయము ప్రభుత్వముయొక్క దృష్టికి కూడ తీసుకొనిరావడమైంది. కాబట్టి యీ విషయాన్ని ప్రభుత్వము పరిశీలించి వెంటనే scholarships మంజూరు చేయటానికి చూస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

తప్పకుండా చూస్తాము.

Sri D. RAMABRAHMAM:—

అధ్యక్షా, ఆంధ్రస్టేటునుంచి మద్రాసు Arts College లో చదువుతున్న వెనుకబడిన జాతికి చెందిన విద్యార్థులకుగాని, schedule caste students కు గాని scholarships యివ్వడము లేదు. అటువంటి విద్యార్థులకు scholarships యివ్వటానికి ప్రభుత్వము పరిశీలిస్తుందా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఇది బహుశః Industries department పరిశీలన చేయవలసిన విషయము అని అనుకుంటాను. ఇది కేవలము Director of Public Instruction కున్నూ, Director of Social Welfare కున్నూ సంబంధించిన భోగట్టామాత్రము యిప్పుడు యివ్వగలిగాము. కాని Arts College కు సంబంధించిన విషయము అంతా కూడా ప్రభుత్వములో Industries శాఖక్రింద యున్నది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—

అధ్యక్షా, scholarships యివ్వడములో ఏవిధమైన విధానము ప్రభుత్వం అవలంబిస్తున్నదో చెబుతారా ? Scholarships యివ్వవలసిందిగా అక్కడ Institute కు వ్రాస్తే డైరక్టరుగారు యివి యింకొకరికి యిస్తున్నారు. అందువల్ల scholarships grant చేసే విధానము ఎటువంటిదో తెలియజేస్తారా ?

The Hon. Dr. B. GOPALA REDDI:—

"They are open to all and the awards are made purely judged on merit and poverty."

31st January 1956.

Sri S. RANGANATHA MUDALIAR:—

Are there any cases of scholarships being granted to Tamil students of this State who are compelled to study at Madras because due to language difficulty they cannot study in the Andhra State? The Tamil students are subjects of this State and they are entitled to scholarships. Are any scholarships being granted to them?

The Hon. Dr. B. GOPALA REDDI:—

I do not know. Generally it is not the policy of the Government to give scholarships to students studying in other States like Madras, Banares, Lucknow and Poona. A separate question may be put.

Sri M. R. APPA RAO:—

Government Colleges లో చదివే students కు యిచ్చే scholarships ను గురించి చెప్పారు. కాని Non-Government affiliated Colleges లో చదువుకునే విద్యార్థులకు ఎంతవరకు యిస్తున్నారో చెబుతారా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

నా దగ్గర యీ ప్రశ్నకు సమాధానము యివ్వగలిగిన బోగట్టా యిప్పుడు లేదు.

Sri P. VENKATA SUBBAYYA:—

ప్రస్తుతము Residential Colleges లో చదివే students Central Government వారు, State Government వారు యిద్దరుగూడ scholarships యిస్తూన్నారు కాని ఒక్కొక్కప్పుడు central Government యిస్తే, State Government cancel చేస్తున్నది. కాని Cuddapah Arts College లో యిచ్చిన కొన్ని కేసులలో cancel చేశారు. ఆ విషయం విచారించి న్యాయము కలుగజేస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఈ scholarships ఒక గవర్నమెంటువారు యిస్తే, యింకొక గవర్నమెంటు వారు యివ్వరు. దానిలో అన్యాయము యేమి జరిగిందో, అర్థము కావటము లేదు. ఒకరు యిస్తే యింకొకరు యివ్వరు కాబట్టి అది అన్యాయముక్రిందకు రాదు.

Sri P. VENKATASUBBAYYA:—

Scholarships యివ్వకపోయినా యిచ్చారనే ఉద్దేశ్యముతో, కొన్ని cancel చేశారు. ఆ విషయము విచారిస్తారా?

The Hon. Dr. B. GOPALA REDDI:—

ఇవ్వకపోయినా యిచ్చారని ఎవరైనా స్వప్నము కన్నారా?

Mr. SPEAKER:—

You have to put a separate question fort his, Mr. Venkata-Subbayya.

31st January 1956.

*Village Vigilance Committees.*

**237—**
* 317 Q.—Sri P. RANGA REDDI:—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether there are Village Vigilance Committees functioning in the State;

(b) if so, what are the functions of the Vigilance Committees and who appoints the members of these Commitees; and

(c) whether any financial help is given by the Government for these Committees?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

(a) "The answer is in the affirmative."

(b) "A note indicating the functions of the Vigilance Committees and how the members are appointed is placed on the Table of the House.

(c) "The answer is in the negative."

Sri M. R. APPA RAO: —

మనరాష్ట్రములో యిటువంటి కమిటీలను స్థాపించటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

మనరాష్ట్రములో వున్నవే నేను చెప్పాను.

Sri P. NARASIMHA APPA RAO:—

అధ్యక్షా, ఈ కమిటీలను పోలీసువారే వేసుకోవడము ఎందుకు? రివిన్యూ డిపార్టుమెంటువారికి యిస్తే, వారు వేసుకోలేరా? వారికి ఎట్టి సంబంధము ఉండదు కాబట్టి రివిన్యూ డిపార్టుమెంటువారిని వేసుకునేటట్లు ప్రభుత్వము ఎందుకు చూడకూడదు?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

Law and order పోలీసువారి చేతులలో నున్నది. అది వారి duty కాబట్టి యీలాంటి కమిటీలు పోలీసువారే వేసుకుంటారు. పోలీసులు రివిన్యూ డిపార్టుమెంటువారు కలిసి వేసే కమిటీలు వేరే వున్నవి.

Sri G. YELLAMANDA REDDI:—

అధ్యక్షా, పోలీసులకు రిపోర్టుచేయుడము, సమాచారము అందించడము యిలాంటివి సాధారణ పౌరులు చేయకూడదా? అందులో యీ కమిటీలయొక్క అవశ్యకత ఏమి వచ్చింది?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

సాధారణ పౌరులు యిదివరకు వ్యతిరేకముగా చేయడమువల్లనూ, వారు సరీగా చేయకపోవడంవల్లనూ, వారిని వేసుకోవడం లేదు.

31st January 1956.

Sri B. SANKARAYYA:—

ఇప్పుడు దీనిలో చెప్పినట్లుగా ఎక్కడైనా కమిటీలు petrol చేయడమువల్ల, గ్రామవెట్టీలకు, తలయార్లకు సహాయం చేయడంగాని ఏమైన జరుగుచున్నదా? కాకపోతే ఎక్కడైనా క్రిమినల్ కేసులు జరిగితే వాటిని మాఫుచేయుటానికి యీ కమిటీ మెంబర్లు పోయి అక్కడ influence ఉపయోగించడం జరుగుచున్నదా?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

అలాంటి సభ్యులు ఉన్నచోట అలాంటి కార్యక్రమములు జరుపుతూ ఉంటారు. మంచివాళ్లు ఉన్నచోట మంచిపనులే చేస్తూఉంటారు.

*Amendment to section 38 of Madras Estates Abolition Act.*

**238—**

* 500 Q.—Sri R. B. RAMAKRISHNA RAJU:—

Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) at what stage the examination of the question of amendment to section 38 of the Madras Estate Abolition Act, raised in the Bill, given notice of by Sri R. B. Ramakrishna Raju is; and

(b) When the Government propose to undertake suitable legislation therefor?

The Hon. Sri K. CHANDRAMOULI:—

(a) and (b) The proposal to amend Section 38 of the Estates Abolition Act is being examined by the Government. Certain particulars relevant to the financial commitment involved, in the proposed amendment have been called for and are awaited from the Board of Revenue. After these particulars are received, the question of undertaking suitable legislation for the purpose, will be considered by the Government.

Sri GOPALU REDDI:—

అధ్యక్షా, ఈ విధంగా దేవస్థానికి సంబంధించిన కొన్ని గ్రామాలు తిరుత్తని తాలూకాలో affect అయినందువల్ల, వారియొక్క పరిపాలనకు చాలా యిబ్బందులు కలుగుతున్నవనే సంగతి ప్రభుత్వదృష్టికి తీసుకొనిరావడమైంది. ఈ విషయములో ప్రభుత్వము ఏమైనా సదుపాయాలు ఏర్పాటు చేయటానికి చూస్తున్నదా?

The Hon. Sri K. CHANDRAMOULI:—

ఆ విషయము తెలుసుకునే, యీ విషయము ఎట్లా చేస్తే బాగా వుంటుందో పరిశీలించి రిపోర్టులు పంపవలసిందిగా వ్రాశారు. ఆ రిపోర్టులు వచ్చినతరువాత సవరణల విషయము ఆలోచించబడుతుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU:—

Estates Abolition Act లో చాలా defective provisions ఉన్నది. ముఖ్యంగా ఆ యాక్టులోని 12, 18 వ శెక్షనులకు సంబంధించినంతమటుకు

31st January 1956.

స్వంత కమతమునకు, buildings కు సంబంధించినవి ప్రభుత్వము ఆలోచిస్తుందా? వాటికి గూడ ఏమైనా చిన్న చిన్న amendment చేయటానికి ఆలోచిస్తుందా?

The Hon. Sri K. CHANDRAMOULI:—

ఈ ప్రశ్న దీనికి సంబంధించదు.

*Starting of a factory at Rajahmundry for manufacture of Stoneware pipes.*

**239—**

* 457 Q.—Sri N. C. SESHADRI:—

Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government propose to start a factory at Rajahmundry for manufacture of stoneware pipes; and

(b) if so, the amount proposed to be spent on it?

The Hon. Sri K. VENKATA RAO:—

(a) Yes Sir.

(b) The total cost of the scheme is estimated at Rs. 2,85,000 recurring and Rs. 2,34,000 non-recurring.

(ఎ) అవునండి.

(బి) ప్రణాళికయొక్క మొత్తము ఖరీదు రు 2,85,000/- లు recurring న్నూ, రు 2,34,000/- లు non-recurring న్నూ అయియున్నది.

Sri N. C. SESHADRI:—

అధ్యక్షా, నంద్యాలకు సమీపములోనున్న మహానందికి దగ్గరగా ఉన్న అడవిలో stone-ware pipes కు కావలసిన material దొరుకుతుందని తెలుస్తున్నది కాబట్టి ఆ విషయము ప్రభుత్వం దర్యాప్తు చేయించారా? వెనుకబడిన రాయలసీమ ప్రాంతములో యిటువంటి stone-ware factory ను కట్టించడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

Mr. SPEAKER:—

You could have included this also in your question.

The Hon. Sri K. VENKATA RAO:—

నేను రాయలసీమ వెనుకబడిన ప్రాంతమని అంగీకరించేవాడిని కాదు. అది చాలా ముందుకు వెళ్లుతున్న ప్రాంతం, ముందుకు వెళ్లవలసిన ప్రాంతంకూడా. కాబట్టి చిరకాలము యీ దృష్టి మనస్సులో పెట్టుకోవద్దని శేషాద్రిగారిని కోరుతున్నాను. ఒకటి మొదలుపెట్టాము. ఇంకా బాగా industrialize కావలసినఉన్న చోట్లలో పెట్టాలి. నంద్యాలదగ్గర ఆ stoneware material దొరుకుతుందని రుజువు అయితే, ప్రభుత్వం తప్పకుండా ఆలోచిస్తుంది.

31st January 1956

Sri N. CHENGALRAYA NAIDU :—

ఉత్పత్తి, రాజమండ్రిలోనే పెట్టేందుకు నిర్ణయించడానికి గల కారణము అక్కడ ఏవైనా ముడిపదార్థములు దొరకుతాయా? లేకుంటే మంత్రిగారి జిల్లా అని పెట్టినారా?

The Hon. Sri K. VENKATA RAO :—

చెంగల్రాయనాయుడుగారికి చిత్తూరుమీద అభిమానం ఉంటే నాకు తూర్పు గోదావరి జిల్లామీద అభిమానము ఉండడం తప్పు లేదు. కాని ప్రస్తుతము 11 జిల్లాల మీద సమానమైన అభిమానం ఉంది. వారు private member కనుక ఒక జిల్లా మీద అభిమానం ఉండవచ్చును. మంత్రిని కనుక నాకు ఏ జిల్లామీద ప్రత్యేకమైన అభిమానము లేదు. కాని ఆయన వారికి పంపించబడిన geological survey report చదువుకుంటే రాజమండ్రిలో పెట్టిన కారణము తెలుస్తుంది. అదే జిల్లాలో graphite clay ఇదివరకు అక్కడ survey centre వగైరాలు ఉండడం చేత అది తక్కువ ఖరీదులో తయారు చెయ్యడానికి అవకాశాలు ఉండడంవల్ల, ఎక్కువగా రైతులు వినియోగించుకునే వస్తువులు ఆ ప్రాంతంలోవారు వాడుతూ ఉండడంవల్ల అక్కడ పెట్టవలసివచ్చింది. చిత్తూరులోకూడా అలాంటి పని వస్తుందని ఆశిస్తున్నాను. అక్కడకూడా పెట్టడానికి అభ్యంతరము లేదు.

Sri S. VEMAYYA :—

ఈ ఫ్యాక్టరీ co-operative basis మీద start చేస్తున్నారా? లేకపోతే వ్యక్తులకు ఇస్తే, అటువంటి వ్యక్తులు ఎవరు?

The Hon. Sri K. VENKATA RAO :—

ఈ industries గవర్నమెంటువారి account లోనే తయారు అగుచున్నవి. అందుచేత వారు వేసిన ప్రశ్న ఉదయించదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA —

అక్కడ నేర్చుకోడానికి అవకాశాలు ఏమైనా ఇస్తున్నారా? నేర్పడానికి ఏమైనా ప్రయత్నంచేస్తారా?

The Hon. Sri K. VENKATA RAO :—

చాలావరకు ఇవన్నీ production cum training Centres.

*Establishment of an Electricity Board in the State.*

**240**

* 472 Q. - Sri N. C. SESHADRI :—

Will the Hon. Minister for Electricity and Social Welfare be pleased to state—

31st January 1956

(a) Whether this Government have taken any steps for the establishment of an Electricity Board in accordance with the directive from the Central Government; and

(b) if so, the names of the members on the Board?

The Hon. Sri G. LATCHANNA :—

(a) The Government have come to the conclusion that an Electricity Board is not necessary for this State at present.

ఈ రాష్ట్రమునకు ప్రస్తుతము ఎలెక్ట్రిసిటిబోర్డు అక్కరలేదనే నిర్ణయమునకు గవర్నమెంటు వచ్చినది.

(b) Does not arise.

ప్రసక్తికిరాదు.

Sri N. C. SESHADRI :—

అధ్యక్షా ! మనరాష్ట్రములో జలవిద్యుచ్ఛక్తికేంద్రాలను అభివృద్ధిచేయాలనుకుంటున్నాము. రెండవ పంచవర్షప్రణాళికలో విద్యుచ్ఛక్తికి ప్రాముఖ్యము ఇస్తున్నాము. కాబట్టి ఈ విషయము పునరాలోచించడము జరుగుతుందా ?

The Hon. Sri G. LATCHANNA :—

ఇది ప్రాథమికదశలోయున్న రాష్ట్రముకాబట్టి కేంద్రబోర్డుయొక్క అధీనములో ఒక బోర్డు నిర్మాణం అనేది అభివృద్ధికి ఆటంకం అవుతుందనే అభిప్రాయం వల్లనే అది మంచిది కాదని ప్రభుత్వం అభిప్రాయపడుతూ ఉన్నది.

Sri PILLALAMARRI VENKATESWARLU :—

ఇప్పుడు కేంద్రప్రభుత్వం ఏ కారణంవల్ల నియమించమని కోరింది? ఆంధ్ర ప్రభుత్వం ఏ కారణంవల్ల నిరాకరించింది?

The Hon. Sri G. LATCHANNA :...

Electricity ఉత్పత్తి, పంపకము అంతా కూడా దేశంమొత్తంమీద ఒకే అజమాయిషీమీద జరిగితే బాగుంటుందని కేంద్రప్రభుత్వ ఆలోచన అయితే ప్రాథమికదశలో ఉన్న ఆంధ్రరాష్ట్రానికి అది లభించదేమోనని రాష్ట్రప్రభుత్వ అభిప్రాయము.

*Number of cases withdrawn under Food Control Order.*

**241—**

* 81 Q.—Sri S. VEMAYYA :

Will the Hon. the Chief Minister be pleased to state—

31st January 1956

(a) the number of cases withdrawn under Foodgrain Control in pursuance of Government orders issued in the last week of March 1955 ; and

(b) the number of persons benefitted?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) Ten cases were withdrawn.

(b) 42 persons were benefitted.

Sri S. VEMAYYA :—

ఈ కేసుల సందర్భములో ప్రభుత్వానికి ఆర్థికముగా ఏమైనా నష్టం వచ్చిందా?

The Hon. Dr. B. GOPALA REDDI

Case లు withdraw చేస్తే నష్టము రాదు. లాభమువస్తుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU :—

ఏ కారణాలవల్ల withdraw చేసినారు?

The Hon. Dr. B. GOPALA REDDI :—

అప్పుడు గవర్నమెంటువారు general orders ఇచ్చినారు. De-control అయిన తరువాత pending cases ను withdraw చెయ్యమన్నారు.

"That all pending prosecutions launched for offences against old control orders relating to food grains issued upto 1-10-1953, whether they were still in force or repealed, should be withdrawn."

Sri S. VEMAYYA :—

42 కేసులలోను 10 కేసులలో పట్టుబడ్డ ధాన్యంకూడా వారికి ఇవ్వబడిందా? లేకపోతే ప్రభుత్వమే తీసుకొని కలుపుకున్నదా?

The Hon. Dr. B. GOPALA REDDI :—

వేరేప్రశ్న వెయ్యండి.

*Increasing the bed-strength and construction of maternity ward at Government Headquarters Hospital, Cuddapah.*

**242—**

* 519 Q.—Sri P. VENKATASUBBAYYA :
Sri Md. RAHAMATHULLAH :

Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

31th January 1956

(a) whether it is a fact that the Hon. Minister made a promise at the time of his visit to the Government Headquarters Hospital, Cuddapah, on 28th October 1955 to enhance the bed-strength of the hospital from 101 to 151 and also to sanction for the construction of an additional maternity ward ; and

(b) if so, when the promise would be implemented ?

The Hon. Sri K. VENKATA RAO :—

(a) and (b)

After my visit to the Hospital in October 1955, the Government have sanctioned the increase in the bed strength of the Government Headquarters Hospital, Cuddapah from 101 to 140 for the present. The question of constructing an additional Maternity ward in the above Hospital is under consideration.

(అ) ; (ఆ)......

Mr. SPEAKER :—

There is no 'అ' 'ఆ' before me.

The Hon. Sri K. VENKATA RAO :—

Telugu alphabet does not admit (e) after (b) 'అ' తరువాత 'ఆ' 'ఇ', 'ఈ' రావాలి కాని ఇక్కడ వారు 'B' ఎందుకు రాయాలి ?

1955 అక్టోబరు నెలలో నేను వెళ్లి హాస్పిటలు చూసిన తరువాత కడపహాస్పిటలులో మంచాలసంఖ్య 101 నుంచి 150 చేసేదానికి ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. అదే హాస్పిటలులో పురిటివాళ్ళకోసం వేరే ward కట్టించే విషయం ప్రభుత్వం ఆలోచనలో ఉంది.

*Construction of co-operative warehouses in Andhra.*

243—

*465 Q.—Sri N. C. SESHADRI :—

Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(a) the amount sanctioned by the Central Goverment for conr,suction of co-operative warehouses in Andhra ;

31st January 1956

(b) whether there is any plan for constucting these warehouses; and

(c) if so, where they are proposed to be constructed?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) No amount has been sanctioned, so far, by the Government of India for construction of warehouses in this State.

(b) and (c). No plans or programmes for the construction of warehouses in the various centres have been finalised so far. These and other condected matters are under the consideration of the Government of India.

Sri N. C. SESHADRI :—

Warehousesకు గాను మనకు ఆర్థిక సహాయము కేంద్రప్రభుత్వమునుండి ఎప్పుడు వస్తుందని ప్రభుత్వము భావిస్తున్నది?

The Hon. Sri D. SANJIVAYYA :—

కేంద్రప్రభుత్వంవారు యీ విషయములో ఒక చట్టమును తయారుచేస్తున్నారు. అది పార్లమెంటువారు ఆమోదించిన తరువాత మిగతా విషయాలను గురించి ఆలోచిస్తాము.

*Charges against Municipal Commissioner, Tadpatri.*

**244—**

* 340-b Q.—Sri C. SUBBARAYUDU:—

Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) whether it is a fact that charges are pending against Sri G. Munikrishnaiah Chetty, Municipal Commissioner, Tadpatri; and

(b) if so, what they are and the action taken in the matter.

31st January 1956

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

(a) Certain irregularities alleged to have been committed by Sri G. Munikrishnaiah Chetty as Municipal Commissioner, Srikakulam are pending.

(b) It is not in the public interest to reveal the nature of allegations. The matter is still under consideration by Government.

Sri C. SUBBARAYUDU —

వారి విషయమై శ్రీకాకుళంలోనే కాకుండా తాడిపత్రికి వచ్చిన తరువాతకూడా చాలా complaints మంత్రిగారికి ఇచ్చారు. I.L.B. గారికి ఇచ్చాము. I.L.B. గారు వారిని Manager గా రివర్టు చెయ్యమన్నారు. ఇది నిజమేనా? ప్రభుత్వము ఏమి చర్య తీసుకుంది?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

గౌరవసభ్యులు అర్జీ ఇచ్చినమాట నిజమే. I. L B. కి పంపినమాట నిజమే, ఇది enquiry లో ఉంది. శ్రీకాకుళంలో ఇచ్చిన రిపోర్టు ఇప్పుడు ప్రభుత్వం విచారణ చేస్తున్నారు.

Sri P. SURYANARAYANA :—

అధ్యక్షా! మునికృష్ణయ్యశెట్టిగారు శ్రీకాకుళం కమిషనరుగా ఉండి చాలా కాలం అయింది. ఎన్నో తప్పులు చేసినట్లు ప్రభుత్వానికి రిపోర్టులు పంపడము అయింది. ఆలోచనలో ఉంది అంటున్నారు. అలా చేస్తే ప్రతిజిల్లాలోను మునిసిపాలిటీలలోను కమీషనర్లను మేనేజర్లను అల్లరి చేస్తారని గమనించవలసి ఉంది.

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

తప్పకుండా ప్రభుత్వం గమనిస్తుంది. ఏ చర్యతీసుకోవడమో ఆలోచిస్తున్నది అని చెప్పాను.

Sri A. VENKATARAMA RAJU :—

శ్రీకాకుళంనుండి చేసిన ట్రాన్స్‌ఫరు కంప్లైంటుమీదనే జరిగిందా? సాధారణంగా జరిగిందా?

(No answer)

Sri C. SUBBARAYUDU :—

లంచగొండితనాన్ని గురించి విచారణ జరుగుతున్నా తాడిపత్రికి వచ్చిన తరువాత 0-4-0 కూడా వదలిపెట్టలేదు అని కంప్లైంటులు వచ్చి, ఆధారాలు ఉన్నప్పుడు అందులో Services నుంచి కమిషనర్లను తీసుకున్నపుడు corruption గా ఉన్నప్పుడు ప్రభుత్వం ఎందుకు కఠినమైన చర్య తీసుకోలేదు?

31st January 1956

Mr. SPEAKER :—

The complaint is already there.

Sri C. SUBBARAYUDU :—

In view of the nature and seriousness of the complaint, the Government should take immediate action. Otherwise, there is no use of any amount of public agitation or representations.

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

Serious allegationకు వచ్చును. లంచగొండితనం గురించి అర్జీవచ్చింది. ఆ మాటనిజమే, ప్రభుత్వం ఒక ఆఫీసరుమీద చర్యతీసుకొనే పద్ధతి ఉంది. విచారణ గురించి ఆలోచిస్తున్నాము, అని మనవి చేస్తున్నాం. రుజువైతే తప్పకుండా చర్య తీసుకుంటాము.

Sri D. KONDAYYA CHOUDARY :—

శ్రీకాకుళంనుండి వారువచ్చినట్లు చెపుతున్నారు. ఎన్ని సంవత్సరాలనుండి charges పెండింగులో ఉన్నాయో మంత్రిగారు తెలియచేస్తారా?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

శ్రీకాకుళంనుంచి వచ్చినప్పటినుంచి ఈ అప్లికేషన్సు ఉన్నాయి. Enquiry అవుతూ ఉంది. Enquiry కావలెనంటే చాలావివరాలు ఉన్నాయి. ఆఫీసరుమీద చర్యతీసుకొనడానికి అనేక కార్యక్రమాలు ఉన్నవి. అన్నీకూడా అమలు జరుగుతున్నవి.

(Many members were seen standing to put supplementary questions.)

Mr. SPEAKER :—

Order, Order. It is a complaint against an officer, which is under consideration. I do not know why the House should flare up.

(There were persistent demands for supplementary questions.)

Mr. SPEAKER :—

Members want information as to how long the complaint is pending.

31st January 1956

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

The complaint is pending since he left Srikakulam.

(Again, many members were seen standing asking permission of the Chair to put supplementary questions.)

Mr. SPEAKER :—

Order, Order. The answer given by the Hon. Minister does not completely answer the question.

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

1954–వ సంవత్సరంలో investigation commence అయినది. అప్పటి నుంచి విచారణలోవుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU :—

ప్రభుత్వానికి రిపోర్టువచ్చి ఎంతకాలమయింది? ఎన్నేళ్ళనుంచి pending లో ఉంది? ఇంకా ఎన్ని నెలలు pending లో ఉంటుంది?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

వీలయినంత త్వరలోనే action తీసుకోబడుతుంది.

The Hon. Sri K. VENKATA RAO :—

Sir, there is a procedure prescribed for taking action against any officer who is even deemed to be corrupt and the relevant rules will have to be observed. Otherwise the High Court will interfere and issue writs and ask compensation to be paid to the officer, as it has happened in 2 or 3 cases. In one case, compensation up to Rs. 40,000 had to be paid.

High Court కనుక దీనిలో interfere కాకపోతే కొంచెం జబర్దస్తీ వుండును. లేకపోతే ఆ procedure లో 15 రోజుల notice యివ్వలేదని స్వయంగా అతనిని విచారించి evidence పుచ్చుకోవాలి, Tribunal కు పంపించాలి, వారి యొక్క report పుచ్చుకోవాలి, గవర్నమెంటు order వేయాలి. దీని అంతటిమీద యిప్పుడు ఉన్న rules మార్చేపరిస్థితి లేక వచ్చే పరిస్థితులను మనస్సులో పెట్టుకోవాలి గాని ఊరికే మథనంచేయడం మంచిది కాదు.

Sri C. SUBBARAYUDU :—

Sir, it is an important matter that an officer continues to be corrupt and commit irregularities. Therefore, I want.........

31st January 1956

Mr. SPEAKER :—

Order, Order. If it is so important, the Member can come forward with a motion and I shall consider. We cannot spend hours for one question.

*Starting of a Handloom Training Institute in the State.*

**245**

* 641 Q.—Sri PRAGADA KOTAIAH :—
Sri N. C. SESHADRI :—

Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there is a proposal to start a Handloom Training Institute during the year 1956-57 ; and

(b) if so, the place selected for the purpose ?

The Hon. Sri K. VENKATA RAO :—

(a) & (b)

Yes, Sir. The scheme has not yet been sanctioned by the Government of India. The question of location of the Institute will be decided later having due regard to all relevant factors.

The Hon. Sri K. VENKATA RAO :—

ఆ, అవునండి. ఈ scheme Govenment of India వారు sanction చేయవలసివున్నది. అది దీని క్రింద ఆలోచిస్తున్నారు. వారియొక్క sanction, మనకు వచ్చిన తరువాత ఎక్కడ పెట్టాలి అనే విషయం ప్రభుత్వంవారు నిర్ణయిస్తారు.

Sri N. C. SESHADRI :—

ఈ చేనేత పారిశ్రామికులు జాస్తిగాఉన్న రాయదుర్గంలో పెట్టడానికి ఆలోచిస్తారా ?

The Hon. Sri K. VENKATA RAO :—

రాయదుర్గంలో పెట్టేటటువంటి అవస్థ ఏర్పడుతుందనుకోను.

*Constitution of a Board for the education of the Anglo-Indians in the State.*

**316**

* 73 Q.–Sri S. VEMAYYA :—

Will the Hon. the Chief Minister be pleased to state whether there are proposals with the Government, to constitute a Board for the education of the Anglo-Indians in the State ?

31st January 1956

The Hon. Dr. B. GOPALA REDDI :—

The answer is in the negative

Sri S. VEMAYYA :—

ఇటువంటి representations ఏమయినా ప్రభుత్వానికి అందినాయా?

The Hon. Dr. B. GOPALA REDDI :—

నాకు తెలిసినంతవరకు ఏమీ లేదు.

*Amount spent for the maintenance of the Buckingham Canal.*

317

* 209 Q.-Sri B. RAMAKRISHNA REDDI :—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) the amount that has been spent annually for the maintenance of the Buckingham canal; and

(b) the income received by the Government as tax on boats plying in the canal?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) 1954–55: Rs. 2,49,852/-

(b) Rs. 34,074–14–3.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—

నాగార్జున Cement Factory కి బొగ్గు కావాలని ఆ బొగ్గు Railway ద్వారా రావడానికి bottle-neck అవుతుంది కనుక Buckingham Canal ద్వారా తెప్పించటానికి వీలుగా అది widen చేయాలనే proposal ఉన్నదని తెలుస్తున్నది. అది ఎంతవరకు యదార్థం? అది అమలు జరుపుతారా?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

Buckingham Canal ద్వారా 2 లక్షల 49 వేలు ఖర్చుపెడితే 34 వేలు మాత్రమే వస్తున్నది. ఎక్కువగా వ్యాపారం అభివృద్ధి అయితే, ఖర్చుపెట్టాలంటే తప్పకుండా ఖర్చుపెట్టవచ్చు.

***Representation regarding stamping weights and measures from Merchants Associations in Guntur District.***

318

* 281 Q.-Sri PRAGADA KOTAIAH :—

Will the Hon. the Minister for Revenue be pleased to state:

31st January 1956

(a) whether the Government are in receipt of representation from Merchants' Associations in Guntur District making allegation of corruption against the authorities of stamping weights and measures and ;

(b) if so, the action taken thereon ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) Yes, Sir,

(b) Enquiries proved nothing against the stamping clerk at Chirala, against whom the allegations were made. The stamping clerk has, however, been transferred from that place.

Sri PRAGADA KOTAIAH :—

అధ్యక్షా ! చేసిన ఆరోపణ ఋజువుకాలేదు. మరి అధికారిని ఎందుకు transfer చేశారు ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

అక్కడ ఆయనమీద ఎక్కువకా అసంతృప్తి ఉన్నకారణంచేత charges రుజువు అయినా కాకపోయినా అక్కడ ఉండడం మంచిదికాదేమో అనే ఉద్దేశ్యంతో బదిలీచేశాము

Sri S. VEMAYYA :—

ఒక ఉద్యోగిని బదిలీచేయడం punishment గా ప్రభుత్వం భావిస్తున్నదా ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

బదిలీచేయడం punishment కాదు.

*Pile Carpet Societies in the State.*

319

* 505 Q.-Sri S. VEMAYYA :—

Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be plased to state :

(a) the number of pile carpet societies in the State now ;

(b) the members on those societies ;

(c) the amount of subsidy or assistance granted to those Societies in 1954-55 and 1955-56 ; and

(d) the number of looms in those Societies ?

31st January 1956

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) There is only one Pile Carpet Weavers Co-operative Society in the West Godavari district.

(b) As on 30-11-1955, there were 156 members in the Eluru Pile Carpet Weavers' Co-operative Society.

(c) A subsidy of Rs. 600/- was given to the society by the State Government during 1954-55 but no subsidy has been sanctioned during 1955-56.

(d) The number of looms in the society is 18.

Sri S. VEMAYYA :—

ఈ రత్నకంబళ్ళనేతను study చేసి యింకా అభివృద్ధిపరచడానికి చర్యలు తీసుకుంటుందా? ఇప్పటివరకు ఏమి చర్యలు తీసుకుంది?

The Hon. Sri D. SANJIVAYYA :—

ఇప్పుడు ఒక proposal ఉన్నది. 40 మగ్గాలతో ఒక కార్ఖానా ఏర్పాటు చేయడానికి 3,62,480 రూపాయలు ఖర్చవుతుంది. అది ఆలోచనలో ఉన్నది.

Sri P. VENKATASUBBAYYA :—

Special Co-operative Societies ను register చేయడానికి registrar కే అధికారం ఉన్నది. అందువల్ల registration ఆలస్యం అవుతుంది. ఈ అధికారం District Registrar కే యిస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA :—

అది నిజముగా అవసరమైతే ఆలోచిస్తాం.

Sri N. SREENIVASA RAO :—

ఏలూరు Society కి ఏమీ subsidy యివ్వలేదన్నారు. వారు apply చేయలేదా? లేక డబ్బులేక మానేశారా?

The Hon. Sri D. SANJIVAYYA —

తే. 4-4-55 లో రు. 600 యిచ్చాము. ఈ సంవత్సరం ఏమీ యివ్వలేదని చెప్పాను.

Sri PILLALAMARRI VENKATESAWARLU :—

ఈ సంవత్సరం ఎందువల్ల యివ్వలేదండీ? దీనిని ఏదో అభివృద్ధి చేస్తాం అని చెబుతున్నారే. ఆ మాత్రం subsidy యిచ్చేస్థితిలో ప్రభుత్వం లేదా?

31st January 1956

The Hon. Sri D. SANJIVAYYA :—

Subsidy యిచ్చే స్థితిలో వున్నాము. అడిగితే యిస్తాము.

Sri S. VEMAYYA :—

అధ్యక్షా, ఇది రాష్ట్రప్రభుత్వం యిచ్చేటటువంటి subsidy అని చెప్పారు. కేంద్రప్రభుత్వంనుంచి ఏదయినా సహాయంతీసుకువచ్చి అందజేయడానికి యితరచోట్లు అభివృద్ధిపరచడానికి ప్రభుత్వం చర్యతీసుకుంటుందా?

The Hon. Sri D. SANJIVAYYA :—

కేంద్రప్రభుత్వంనుంచి యింతకుపూర్వం చాలా subsidyలు యీ సంస్థ పొందింది. 1937-38 లో రెండువేలు, ఆ తరువాత వెయ్యి, ఆ తరువాత వెయ్యి, ఆ తరువాత 2979, యిలా చాలా వున్నది. All India Khadi and Village Industries Board వారు దీనిని cottage Industry గా పరిగణించినట్లయితే వారుకూడా ఏదయినా సహాయం చేస్తారు.

Sri PRAGADA KOTAIAH :—

అధ్యక్షా, ఏదో ఇంగ్లాండ్ 3 లక్షల ఖర్చుతో నెలకొల్పాలని అంటున్నారు. బందరులో పెట్టడానికి ఏర్పాటు చేస్తున్నారా?

The Hon. Sri D. SANJIVAYYA :—

కాదండీ. ఏలూరులో ఏర్పాటుచేస్తాము. బందరులో కావలిస్తే కలంకారి చేస్తే చేయవచ్చు.

*Proportion between Direct recruits and promotees to the cadre of District Judges.*

**320—**

* 310 Q.—Sri T. LAKSHMINARAYANA REDDI :—

Will the Hon. the Chief Minister be pleased to State :

(a) whether there is any proportion fixed between the direct recruits and the promotees to the cadre of the District Judges; and

(b) if so, what the proportion is ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

(a) The matter is under the active consideration of the Government and a decision is likely to be reached soon.

(b) Does not arise.

31st January 1956

*Amount spent for purchase of Boots, Chapals (Kabul Sandals) etc. by Police Department.*

**321**

* 649 Q.- Sri M. RAJESWARA RAO :—

Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) the number of pairs of boots and chapals (Kabul Sandals) and the number of belts and other leather goods purchased and the amount spent therefor in each of the District by the Police Department every year; and during the year 1954–55; and

(b) the agencies which supplied the leather goods during the year?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) and (b) :—The information is placed on the Table of the House.

Sri M. RAJESWARA RAO :—

Table మీద ఉంచబడిన statement ను చూస్తే లక్షలాది డబ్బు యీ leather goods మీద ఖర్చుపెడుతున్నట్టు కనబడుతున్నది. ఈ డబ్బంతా కూడా పెద్ద పెద్ద కంపెనీలకే లాభంగా ముట్టుతున్నట్టు కనపడుతుంది. ఈ తోళ్ల పరిశ్రమను అభివృద్ధి చేయడానికి Co-operative societies కు tender లేకుండా యివ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

ఈ ప్రశ్న Co-operative Department మంత్రిగారికి వేయండి. Police Department ఎక్కడ దొరికితే అక్కడ కొనాలి. Rajeswara Rao గారు ప్రశ్న వేశారు కాబట్టి ఏ కంపెనీ అని చూశాము. కాని I. G. గారు యీ boots విషయంలో తోళ్లపరిశ్రమల జోక్యం పుచ్చుకోవడం లేదు.

*Draft declaration for house sites for Harijans in Krishna District.*

**322**

* 243 Q.- Sri V. VISWESWARA RAO :—

Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to State:

(a) the number of cases of house sites for Harijans for which the Draft Declaration in Krishna District are published;

(b) the number of places in which the sites were actually handed over to Harijans in 1953–54 and 1954–55;

---

* Vide appendix at pages 253-256. infra.

31st January 1956

(c) whether the Government have disbanded the additional staff appointed for finalising allotment of house sites for Harijans in Krishna District ; and

(d) if so, why ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) 84 cases.

| | |
|---|---|
| (b) 1953–54 | 1954–55 |
| 5 places | 7 places |

(c) The answer is in the affirmative.

(d) As the special staff employed for finalising allotment of house sites for Harijans has completed the bulk of the work and as it had no work which has to be attended to immediately, the staff was disbanded on 30–6–1955. The need for the additional staff was again keenly felt and the staff was therefore re-employed from November 1955.

(a) 84 cases.

(b) 1953-54 లో 5 గ్రామాలలో 5 కోట్లు, 1954–55 లో 7 కోట్లు ఏర్పాటు చేయబడింది.

(c) ఔను.

(d) మొట్టమొదట additional staff రద్దుచేయబడినా addtional staff అవసరం గమనించి 1955–వ సం॥ నవంబరునుంచి తిరిగి నియమించబడింది.

Sri V. VISWESWARA RAO :—

అధ్యక్షా, 84 applications వచ్చినాయని చెబుతున్నారు. ఇందులో 2 సంవత్సరాలకు 5 applications పరిష్కరించకలిగిందని చెబుతున్నారు. ఈ పరిస్థితిలో additional staff ఎందుకు రద్దుచేశారు ?

The Hon. Sri G. LATCHANNA :—

అప్పటికి ఈ additional staff చేయవలసిన కార్యక్రమం పూర్తవడంచేత రద్దుచేశాము. తిరిగి పని ఎక్కువ కాగానే నవంబరులో నియమించాము.

Sri V. VISWESWARA RAO :—

10 ప్రాంతాలలో యిండ్లస్థలాలు యిచ్చినపుడు 74 ప్రాంతాలలో మిగిలి వున్నపుడు ఆ పని తగ్గిపోయిందని ఎందుకనుకున్నారో మంత్రిగారు చెబుతారా ?

The Hon. Sri G. LATCHANNA: —

Additional staff చేయవలసిన పని వచ్చిన proposal పరిశీలనచేసి award కు shape యివ్వడం. ఆ shape అయినతరువాత additional staff కు పని ఒత్తిడి లేదు. ఒక్క ఆఫీసరు చూచుకోవచ్చు అన్నారు.

Sri PILLALAMARRI VENKATESWARLU :—

ఈ 84 cases gazette లో publish ఐనప్పటికిన్నీ వాటి అన్నింటిలో house-sites ను Harijans కు ఎందుకు అందజేయలేక పోయినారో తెలియజేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA: —

ఇప్పుడు దీనికి సంబంధించినంతవరకూ 1953-54 లో 5 చోట్ల యివ్వడమైనది, 1954-55 లో మిగిలినవి civil litigation writs తగాయిదాలు వున్నాయి. అందుకని యివ్వడానికి వీలులేదు.

Sri M. NAGI REDDY :—

ఈ House sites విషయంలో మంజూరుచేసేటప్పటికే 5, 6 సంవత్సరాలు పట్టుతుంది. మంజూరుచేసి Gazette లో publish ఐన తర్వాత మళ్ళీ ఎవరో ఏ భూస్వామో objection పెట్టాడని చెప్పి మళ్ళీ stay orders యిస్తున్నారు. ఈ విధమైన కేసులు గుంటూరుజిల్లాలో అనేకచోట్ల జరుగుతూవున్నాయి. కాబట్టి ఒకసారి Gazette లో publish అయినతర్వాత అవి తప్పక హరిజనులకు యిచ్చేటట్లు ప్రభుత్వము చూస్తుందా ?

The Hon. Sri G. LATCHANNA :—

ప్రభుత్వము యివ్వడానికిగానే Gazette లో publish చేస్తుంది. ఎవరైనా పార్టీవారు కోర్టుకు వెళ్ళి వ్యవహారము జరిపినప్పుడు కోర్టును ధిక్కరించడానికి ప్రభుత్వానికి అవకాశము లేదు.

Mr. SPEAKER :—

Questions Nos. 323 and 324 will be taken together as they relate to the same subject.

*Entertaining applications for house sites for Harijans by the District Welfare Officers.*

**323**

251 Q.- * Sri V. VISWESWARA RAO :—

Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to State :

(a) Whether it is a fact that the Government issued orders forbidding the District Welfare Officers from entertaining fresh applications for house sites for the Harijans.

(b) how many fresh applications for house-sites for Harijans were received by the District Welfare Officer, Krishna, from 1st January, 1955 ; and

(c) the action taken thereon ?

31st January 1956

The Hon. Sri G. LATCHANNA :—

(a) The answer is in the negative.

(b) 139

(c) The applications are under scrutiny by the Additional District Welfare Officers I & II of Krishna District.

*Land acquisition for house sites for Harijans in Krishna District.*

324

* 253 Q. :—Sri V. VISWESWARA RAO :—

Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) in how many cases of land acquisition for house-sites for Harijans in Krishna District, actual possession was not made over even though the necessary awards were passed ; and

(b) how many of these are pending in Civil Courts ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) 18 cases.

(b) 15 cases.

Sri V. VISWESWARA RAO :—

ఇన్ని applications వున్నపుడు 1955 లో 139 applications వున్నాయని చెప్పి అంతకు పూర్వము 84 applications వున్నాయని చెప్పడములో అక్కడవున్న additional staff ను రద్దుచేయుటకుగాని జిల్లాకలెక్టరు చూపించిన కారణాలేమిటో మంత్రిగారు వివరిస్తారా ? అంతకుముందున్న additional staff ను రద్దుచేయవలసిన అవసరమేమి ఏర్పడింది ?

The Hon. Sri G. LATCHANNA :—

ఈ paplications ప్రతి ఏటా వస్తుంటాయి. అప్పుడువున్న aplications వివరాలు మొదటి ప్రశ్నలో సమాధానము చెప్పడము అయినది, తర్వాత applications ఎక్కువ అయినాయి. ఎక్కువైతే మళ్ళీ staff ను ఎక్కువ చేయడమైంది. పనివున్నపుడు అవసరాన్నిబట్టి చేయడము జరుగుతూవుంటుంది.

Sri V. VISWESWARA RAO :—

అధ్యక్షా, ఇక్కడ చాలా applications ఉన్నాయని మంత్రిగారు ఒప్పుకున్నారు. అందులో 1953-54 లో 5, 1954-55 లో 5 మాత్రము యివ్వడము జరిగింది. సుమారు రెండువందల applications కు పైగా వుంటే 10 గ్రామాలలో మాత్రమే యిచ్చి, మిగిలినవి పనిలేదు కాబట్టి additional staff ను తగ్గించి వేశాము అని

మంత్రిగారు ప్రసంగించడము న్యాయము కాదని చెప్పి ఎంతపని వున్నప్పటికికూడా ఉద్యోగులను తగ్గించివేసి applications బుట్టదాఖలా చేయమని instructions యిచ్చారా అని అడుగుతున్నాను.

The Hon. Sri G. LATCHANNA :—

అటువంటి instructions లేవు. అది దురభిప్రాయమని చెప్పి నేను మనవి చేయడము జరిగింది. ఐతే నేను మొదట చెప్పిన వివరాలలోనే ముందు 14 కేసులలో ప్రాథమిక పరిశీలన పూర్తి ఐతే దానికి సంబంధించిన additional staff ను రద్దు చేయమనివుంది. తర్వాత applications సంఖ్య 139 అయినది. అప్పుడు మళ్ళీ additional staff ను వేయడమైనది. అందుచేత additional staff వేయడమనేది అపుడువున్న ఆయా కాలాలలోవున్న ఒత్తిడినిబట్టి పని జరుగుతూవుంటుంది. కాన ఏ కలెక్టరు అయితే additional staff అక్కరలేదని అన్నారో ఆ కలెక్టరే మళ్ళీ పని ఒత్తిడి అయినతర్వాత కావాలనడము ప్రభుత్వము ఆమోదించడమూ జరుగుతుంది. కాబట్టి దురభిప్రాయపడితే పొరపాటు, అపోహపడవలసిన అవకాశము లేదని మనవి చేస్తున్నాను.

Sri P. GUNNAYYA .—

అధ్యక్షా, మంత్రిగారు additional staff ను గురించి మాట్లాడారు కాబట్టి నేను మనవి చేస్తున్నాను. కనీసము ఒక సంవత్సరమైంది, హరిజనులకు land aquisition కుగాను additional staff ను వేశారు. ఇదివరకు 10 ఏండ్ల క్రిందట ఎలాగున్నదో సంవత్సరమునుండి వారిని వేసినందువల్ల, అంతకంటే తక్కువ పని జరిగింది. ఏమికూడా జరుగలేదు. కాబట్టి గవర్నమెంటుకు డబ్బయినా మిగులుతుంది కాబట్టి హరిజనుల ఇండ్లస్థలాలకుగాను వున్న సిబ్బందిని తొలగించమని మనవిచేస్తున్నాను.

Mr. SPEAKER :—

ప్రశ్న వేయండి.

Sri P. GUNNAYYA :—

ఆ staff ను తగ్గించడానికి ఉత్తర్వుచేస్తారా అని మనవిచేస్తున్నాను.

No answer.

Sri S. VEMAYYA :—

ఇప్పుడు additional staff పనిచేస్తుంది, అది బహుశాః కేంద్ర ప్రభుత్వ subsidy తో పనిచేస్తున్నట్లుగా కూడా తెలుస్తుంది. దాని కాలము మార్చితో అంతము కాకుండా పొడిగించే దానికి కేంద్రప్రభుత్వముతో సంప్రదింపులు జరిపి ప్రభుత్వము యీ staff ను కొనసాగించడానికి పూనుకుంటుందా ?

The Hon. Sri G. LATCHANNA :—

పని ఒత్తిడిగా వున్నంతవరకూ additional staff ను అవసరమైనపుడు ప్రభుత్వము నియమిస్తుంది.

31st January 1956

Sri PILLALAMARRI VENKATESWARLU :—

చాల cases లో gazette notify ఐన తర్వాతకూడా వాండ్లకు ఇండ్లస్థలాలు hand over చేయడమనేది జరుగలేదు, దానికి కారణము. ఇదివరకు మంత్రిగారు యిచ్చిన సమాధానము ప్రకారం Land Aquisition Act లో ఏవో కొన్ని difficulties వున్నాయి, కొన్ని అడ్డంకులువున్నాయి. అవి సవరిస్తే గాని మనము త్వరత్వరగా కార్యక్రమాన్ని పూర్తిచేసుకోలేమని సంజీవయ్యగారు యీ department చూస్తూవుండేరోజులలో తెలియజేశారు. ఈ మంత్రిగారు Land Acquisition Act ను సవరించడానికి ఏమైనా ఆలోచిస్తారా? ఆలోచిస్తే ఎప్పటిలోగా తీసుక రాగల్గుతారు?

The Hon. Sri. G. LATCHANNA :—

ఈ పని తొందరగా జరిపించాలని Emergency Rules క్రింద యీ house acquisition కార్యక్రమాన్ని పొడిగించడానికి ప్రభుత్వము తాఖీదులు యిచ్చాము. దానిని అనుసరించి పని చురుకుగానే జరుగుతూవున్నది. 324 ప్రశ్నకు సమాధానములో స్పష్టముగా తెలియజేయబడ్డాయి అంకెలు. 18 కేసులలో awards యివ్వడానికి notification లు ఇచ్చినా అయితే 15 వాటికి Civil Court తగవులు వచ్చినందువల్ల నిలిపి వేయబడ్డాయి. మిగతా మూడు యివ్వబడ్డాయి. Litigation వున్నచోట కొంత ఆలస్యము జరుగుతుంది. సాధ్యమైనంతవరకు గౌరవ సభ్యులు litigation లేకుండా వ్యవహారాలు గ్రామాలలో చేస్తూవుంటే ప్రభుత్వము వీలైనంత త్వరగా వ్యవహారాలు చక్కబెట్టుతుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU :—

దీనికి సమాధానము Land Acquisition Act లో వున్న difficulties వల్ల త్వరగా applications dispose of చేయలేకపోతున్నామని గతములో సంజీవయ్యగారు తెలియజేశారు. Land Acquisition Act ను amend చేయడానికికూడా ఆలోచిస్తున్నామని చెప్పారు. రెండు సంవత్సరాలు కావస్తుందే ఆలాంటపుడు యీ Land Acquisition Act ను amend చేసే ఆలోచన యీ మంత్రిగారికి వున్నదా? ఎప్పటిలోగా యీ amending bill తీసుక రావడానికి వీలువుంటుంది?

The Hon. Sri G. LATCHANNA: —

Acquisition Act ను amend చేయడం Revenue Department లో పరిశీలన జరుగుతున్నది. కాని యిప్పుడువున్న Act ప్రకారముగనే వీలువున్నంత తొందరగా చర్యతీసుకోనేటట్టుగా Emergency Rules apply చేసి కార్యక్రమము నడిపించే విధానము జరుగుతున్నదని యిప్పటికి అనేక సారులు శాసనసభలో సభ్యులకు మనవి చేయడమైనది.

Sri G. NAGESWARA RAO :—

అధ్యక్షా, గతములో 10, 12 సంవత్సరాల క్రిందటనుంచీకూడా ఇండ్లస్థలాల కోసము డబ్బు చెల్లించని గ్రామాలున్నాయి. ఆ స్థలాలు యిప్పటికికూడా యివ్వ లేదు. ఇప్పుడైనా యీ సంవత్సరముగాని, వచ్చే సంవత్సరముగాని అటువంటి కేసులన్నీ తీసుకొని ముందు డబ్బుయిచ్చేవాండ్లకు priority గా స్థలాలు acquire చేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :—

గౌరవ సభ్యులు స్పష్టమైన కేసులేవైనా తెలియచేస్తే వాటిని గురించి తగినచర్య తీసుకొంటాము.

Sri V. VISWESWARA RAO :—

అధ్యక్షా, 324-వ ప్రశ్నలో 18 కేసులలో award pass చేసి తీసుకోలేదని చెప్పారు. అందులో 15 కోర్టులో వున్నాయని చెప్పారు. ఆ 18 లో 15 వున్నవా లేకపోతే యితరం యేమైనా వున్నావా ? ఉంటే చదువుతారా ?

The Hon. Sri G. LATCHANNA :—

18 లో 15. ఆ మిగిలిన మూడు యివ్వడము జరిగింది. వివరాలు కావాలంటే మరొక ప్రశ్న వేస్తే మనవిచేస్తాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—

323-వ ప్రశ్నలో దీనివిషయం యేమి చెప్పారు ?

The Hon. Sri G. LATCHANNA :—

నేను మనవిచేశాను. సభ్యులు వినలేదేమో. అటువంటిది ఏమీ జరుగలేదు అని మనవిచేశాను.

*Post of a Joint Registrar of Co-operative Societies.*

325

* 513 Q.–Sri P. VENKATASUBBAYYA :—

Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) Whether a sanctioned post of a Joint Registrar of Co-operative Societies is still kept vacant; and

(b) if so, the reasons therefor ?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) and (b) : Yes Sir. The post of a Joint Registrar of Co-operative Societies sanctioned for work connected with Handloom Cess Fund schemes has not been filled up for administrative reasons. The question of filling up the post is under consideration.

## II ANNOUNCEMENT re :

*Extension of time for presentation of Report by the Select Committee on the Madras Estate Land (Andhra Amendment), Bill 1955.*

Mr. SPEAKER :—

I have to announce to the House that Sri K. Chandramouli, Minister for Land Revenue and Endowments has sent me the following letter :—

" I am to state that due to unavoidable circumstances the Select Committee on the Madras Estates Land (Andhra Amendment) Bill, 1955 could not finish its labour and submit the report before the time originally fixed for presenting the Report of the Select Committee *i. e.* 28th January, 1956.

I beg leave to move that the time for presenting the Report may be extended till 1st March, 1956."

The Hon. Dr. B. GOPALA REDDI :—

Sir, the Assembly will be meeting on the 25th February and if the report is ready by that time it can be presented to the House. So, it need not be 1st March. Once we go into the budget, it will be difficult to take up this Bill and we are anxious that we should finish it before we go into the budget on the 2nd March. So, we may fix 25th February as the date before which the report should be presented to the House.

The Hon. Sri K. CHANDRAMOULI :—

Sir, time for presenting the report may be extended till 25th February, 1956.

Leave was granted up to 25th February, 1956.

Sri VAVILALA GOPALAKRISHNAYYA —

అధ్యక్షా ! ఈ వేళ Indian Express లో C. R. C. Proposals cold storage లో పెట్టుతున్నారని చెప్పే వార్త వచ్చింది. అదేమన్నా ప్రభుత్వానికి తెల్సిందా ?

The Hon. Dr. B. GOPALA REDDI :—

ఇచ్చిన వాగ్దానం ప్రకారం decision రాకపోతే అసెంబ్లీలో రేపు దీనిని గురించి చర్చ ఉంటుంది.

## III GOVERNMENT BILL

### *The Andhra Court Fees and Suits Valuation Bill, 1955 (As amended by the Select Committee) (Contd.)*

SRI D. V. SUBBA RAO :—

అధ్యక్షా! నిన్న ఉపముఖ్యమంత్రిగారు, Law Minister గారు యీ Court Fees and Suits Valuation Bill, 1955, ను ఏకగ్రీవంగా ఆమోదించాలని సభ వారికి విజ్ఞప్తిచేసారు. కానీ అట్లు ఆమోదించడానికి వీల్లేదని తెలియ చేస్తున్నాను. Court Fees and Suits Valuation Act, గత శతాబ్దంలో ప్యాసు అయినది. అప్పటినుంచి యిప్పటివరకు పరిస్థితులు చాలామారినవి. అందువల్ల Act లో కొన్ని మార్పులు చేయవలసివచ్చినది అన్న దానిలో అంగీకరిస్తాను. అయితే ఆ కారణం వల్ల కేవలం court fees లను దారుణంగా పెంపుచేయడం సబబు కాదు. గవర్నమెంటు ధనాపేక్షయే ప్రధానోద్దేశముగా పెట్టుకొని యేదో ఒక విధానముగా డబ్బు పెంచడమే పనిగా పెట్టుకొని యీ కోర్టు ఫీసు అనేకరెట్లు హెచ్చుచేయడం మాత్రం హితవు కాదని మనవిచేస్తున్నాను. మన రాష్ట్రము పారిశ్రామికంగా అభివృద్ధి కాలేదు. ఇప్పుడు బొంబాయి, యు. పి. అటువంటి రాష్ట్రాల్లోనయితే వేలు, లక్షలు ఆదాయం ఉన్న వారు చాలమంది ఉన్నారు. అటువంటివాళ్లు ఏమి పెట్టుకోవలెనన్నా పెట్టుకోగలరు. కానీ, మధ్యతరగతి వ్యవసాయదారులు, బీదరైతాంగము ఎక్కువ ఉన్న రాష్ట్రం యిది. మన కోర్టుల్లో లిటిగెంట్సును చూచినట్లయితే అత్యధిక సంఖ్యాకులు గ్రామీణ రైతాంగమే. అటువంటివాళ్లపై ఇప్పుడే ప్రాజెక్టు అఫెక్టెడు యేరియాస్‌లో Better ment Tax అని, compulsory water cess అని యీ విధంగా అనేక రకాల పన్నులభారం కలుగజేస్తూ పైగా ఏదైనా అవసరం కలిగి కోర్టులకు వెళ్లితే ఆ కోర్టు ఫీజు అనేది యింకా యెక్కువ చేసినట్లయితే వాళ్లకు దుర్భరమైనట్టి పరిస్థితులు ఏర్పడుతాయని మనవిచేస్తున్నాను.

అందువల్ల కోర్టు ఫీజు అనేది ఎక్కువచేయడంలో సబబు ఏమీకనబడటంలేదు. ఇంకొకటి, ప్రస్తుతం కాంగ్రెసు సంస్థకూడా మొన్న అవడి కాంగ్రెసు మహాసభలో ప్రకటించినట్లుగా socialistic pattern of society ఆశయము అని చెప్పుతోంది. ప్రతి పక్షంలో ఉన్న కమ్యూనిష్టులు, సోషలిస్టులుకూడా అదే చెప్పుతున్నారు. ఆసందర్భంలో నిజంగా socialistic pattern of society మన ఆశయమయితే, ఆ ఆశయమే సిద్ధించినట్లయితే యీ కోర్టులు అసలు ఉండనే వుండవు. న్యాయప్రదానం ఉచితంగానే జరగాలి, అయితే ఆ ఆశయం అనేది యింకా కొన్ని వేలమైళ్లదూరంలో ఉన్నది. ఎప్పటికి వస్తుందో ఎవరికీ తెలియదు అందుచేత ప్రస్తుత పరిస్థితులను బట్టి న్యాయమనేది అమ్మడానికి అందరు ఒప్పుకోవలసిందే. అంటే Justice must be sold. ఏదో కొంత court fees అయినా వసూలు చేయడము సబబైనదే. న్యాయం

కొంతడబ్బు ఖర్చుపెట్టితేగాని దొరకదు. అందుకు అంగీకరిస్తాము. అలాఅని చెప్పి దుర్భరమైన పరిస్థితులను తీసుకొచ్చి అత్యధికంగా కోర్టు ఫీజును పెంచడం ఏ మాత్రం సక్రమమైనది కాదని మనవి చేస్తున్నాను. ప్రభుత్వం ఒక సిటిజన్‌కి సిటిజన్‌కి మధ్యను న్యాయమనేది ఉచితంగా చేయడం అనేది కూడా చాలా సబబు అయిన విషయమే. ఇప్పుడు అమలులో ఒక క్రిమినల్ కేసు ఉంది. చెయ్యినరికేయడం అని చెప్పి ఒకరు కేసుపెడితే కోర్టు ఫీజు ఏమిలేకుండానే పోలీసు వారు కేసు పెట్టుతున్నారు. శిక్షిస్తున్నారు.

ఒక వందరూపాయలు నోటు 'ఏ' అనేవాడు 'బి' అనేవాడికి వ్రాసియిస్తే 'బి' అనేవాడు నానోటు 'ఏ' అనేవాడు అపహరించాడు అంటే, అపహరించినందుకు దొంగతనము కేసుపెట్టితే దానికి కోర్టు ఫీజు ఏమీలేదు. కాని యీ వందరూపాయలు నోటు మాత్రం 'ఏ' అనేవాడు అపహరించకుండా డబ్బుమాత్రం యివ్వడముమానేస్తే దానిపై 'బి' దావావేస్తేమాత్రం కోర్టు ఫీజు చెల్లించుకోవలసివస్తుంది దానికీ దీనికి తేడా ఏమిటి? నోటుపట్టుకుపోతే ఏమి? నోటుదగ్గర ఉంచుకొని వాడడిగినప్పుడు యివ్వకపోతేమాత్రం యేమిటి? కానీ దీనికేమో డబ్బు ఖర్చుపెట్టవలసివస్తూంది. దానికి మాత్రం డబ్బు యేమీఖర్చులేదు. అంటే క్రిమినల్ సైడులో పార్టి డబ్బు ఖర్చుపెట్టకుండానే ప్రభుత్వమే ఖర్చు భరించడం జరుగుతుంది. సివిల్ అనేటప్పటికల్లా యితను ఏదో దావాచేసేటప్పటికల్లా వడ్డీ ఖర్చులు ఒలికిపోతావుందని యితనివద్దనేమో court fees పుచ్చుకోవడం జరుగుతోంది. ఏదైనాసరే నేను అంగీకరించినట్లుగా సోషలిస్టు తరహా సమాజస్థాపన ఆశయం యింకా చాలా అందనిపండు కాబట్టి కోర్టుఫీజు వసూలు చెయ్యటంలో అంతతప్పేమీ లేదు కానీ ఎక్కువ చెయ్యటం అనే విషయమై ఆక్షేపణ తెలియపరుస్తున్నాము. ఇప్పుడు పెద్దపెద్ద Jurists, High Court Judges, Supreme Court Judges, ఇంకా ఆర్థికశాస్త్ర నిపుణులు వీరందరుకూడా న్యాయ ప్రదానమువల్ల ప్రభుత్వానికి ఖర్చులెంతో అంతకు సరిపడే ఫీజు పుచ్చుకోవాలిగాని అదొక లాభసాటివ్యాపారంగా మాత్రం మల్లించడానికి వీల్లేదని ఏకాభిప్రాయంగా చెప్తున్నారు.

పన్నుల విచారణ సంఘసభ్యులు నిపుణులేకదా. వారు వ్రాసిందేమిటంటే (108-వ పేజీలో) "The collection of court fees by the Government should be only on the basis of covering the expenses of administration of Justice". అందుచేత సరీగా న్యాయప్రదానానికి ఖర్చు ఎంతఅవుతుందో అంతవరకే ఫీజు వసూలుచేయాలిగానీ మనము యింకా దేశమును సర్వతోముఖమున అభివృద్ధి చేయవలసివుంది కాబట్టి అన్నివిధాలుగాను యీ కోర్టుఫీజు ద్వారాను యింకా యెక్కువ డబ్బువసూలుచేస్తాము. కొంత అధికంగా మిగిలేటట్టు చేద్దాం అని అనుకోవడం యే ప్రభుత్వానికి తగదు అని మనవి చేస్తున్నాను. తర్వాత Chief Justice of India వెలిబుచ్చిన అభిప్రాయాన్ని పరిశీలించినట్లయితే

గవర్నమెంటు రాబట్టే ఖర్చు గవర్నమెంటుకు అయ్యే ఖర్చుకి మించి ఉండకూడదు. దానికిదానికి సరిపోవాలని వారి అభిప్రాయముకూడా వున్నది. ఈ విధముగా న్యాయ ప్రదానం విషయంలో ఉన్నతోద్యోగులు అర్థికశాస్త్ర నిపుణులు అందరుకూడా లాభంవచ్చే పద్ధతిని గవర్నమెంటు ఈ అక్షు ప్యాసు చేయకూడదని చెప్పుతూఉన్నప్పుడు యిది ఆ విధంగానే ప్యాసు చెయ్యాలని యీ బిల్లు తీసుకొనిరావడములో సబబుయేమీ కనబడడం లేదు

అయితే "లాభంవచ్చేటట్టుగా యీ బిల్లు మేము డ్రాఫ్టుచేసామని చెప్పడానికి గల ఆధారము ఏమిటని" మంత్రిగారు అడుగుతారేమో. నా దగ్గరవున్న లెక్కలనుబట్టి చూచినట్లయితే (అంటే ప్రభుత్వంవారిచ్చిన లెక్కలే), Budget estimates of Revenue of 55-56. Judicial stamps వల్ల రు. 64,78,000, Administration of Justice వల్ల రు. 26,76,000 Total income as 91,54,000 (pages 7 & 23 of Budget Memorandum of 1955-56) అని ఉన్నది. అయితే Judicial stamps కు ఖర్చు రు. 1,45,000, Administration of justice కు రు. 69,15,000, మొత్తం ఖర్చు రు. 70,60,000 అని ఉన్నది. అంటే మొత్తంమీద యేమైంది. ఆదాయానికి ఖర్చులకూ తేడా దాదాపు 21 లక్షలు కనబడుతుంది. కాబట్టి యిది profit making concern క్రింద తయారు అవుతున్నదన్న మాట. నేను ఆదిలో మనవిచేసినట్లుగా కోర్టుకెళ్ళేవారు అత్యధిక సంఖ్యాకులు గ్రామీణులే. ఇటువంటివాళ్ళను అనేక రకాల పన్నులు మనం వేస్తూన్నపుడు కోర్టుఫీసుకూడా యేదో డబ్బుకోసమని యెక్కువ చేయడం సబబు కాదని యిదివరకే మనవిచేసియున్నాను. ఇప్పుడు 21 లక్షలు మన Budget ను బట్టి యెక్కువ ఆదాయం కనబడుతుంది. కోర్టుకు యెవరు వెళ్ళుతారు? క్రొవ్వుయెక్కినవాడే వెళ్ళుతాడు అని మంత్రిగారు అనవచ్చు. క్రొవ్వుయెక్కినవాడు కోర్టుకెళ్ళినా బీదవాడిమీద దావావేస్తే వీడుకూడా వాడితో పాటు కోర్టుకు వెళ్ళాలి. లేకపోతే వున్న ఆస్తిఅంతా పోతుంది. అందుచేత ఆత్మరక్షణ కోసమని, డిఫెన్సు చేసుకోటానికని బీదవాడుకూడా కోర్టుకువెళ్ళక తప్పదు. ఇతను గానీ, యే కారణంచేతనైనా ఓడిపోయినట్లు అయితే అవతలివాడు యే కోర్టుఫీజు పెట్టాడో యే ఖర్చులు లా ప్రకారం అయ్యాయో అవన్నీ యిచ్చుకోమనేటప్పటికీ మూలిగేనక్కమీద తాటికాయపడ్డట్లవుతుంది. అందువల్ల litigation అనేది కేవలం భాగ్యవంతులకే కాదు. బీదవారిపైకూడా దీని భారం పడుతుంది. కాబట్టి వారి స్థితికూడా మనం దృష్టిలో పెట్టుకొని యీ బిల్లును పరిశీలించాలని మనవిచేస్తున్నాను.

"Taxation గురించి ఏ Act పెట్టినాసరే దానికి అడ్డుపెట్టడము మీకు అలవాటైపోయింది. పన్నులు వేయకపోతే ప్రభుత్వానికి డబ్బు ఎక్కడనుంచి వస్తుంది. డబ్బులేకపోతే ప్రభుత్వం నడుస్తుందా'' అని మంత్రిగారు అనవచ్చును. డబ్బురావడానికి ఇతర మార్గాలు చాలా ఉన్నాయి. ప్రతి taxation కు మేము అడ్డు పెట్ట

షము లేదు. ధనవంతుని మీద tax తప్పకుండా వేయవలసిందేనని మేము చెబుతున్నాము. కానీ బీదవారిమీద, మధ్యతరగతివారిమీద తగ్గించమని చెబుతున్నాము. ఇప్పుడు జమీందారులకు ఎన్నోకోట్ల రూపాయలు నష్టపరిహారము ఇస్తున్నారు. వాటిని bonds రూపంగానో, ఎక్కువ వాయిదాల క్రిందనో మార్చినట్లయితే, ఇప్పుడు గవర్నమెంటుకు ఎన్నోకోట్ల రూపాయలు ఖర్చుతగ్గుతుంది. గతసంవత్సరము నష్టపరిహారంగా 30 లక్షల రూపాయిలు ఇచ్చారని records వల్ల తెలుస్తున్నది. ఇటువంటివన్నీ bonds క్రింద convert చేసి డబ్బునిలువ చేయవచ్చును. బీదవాడు ఏదైనా అవసర ముండి కోర్టులకు వెడితే వానిమీద ఇంతభారం వేయడంకంటే ధనవంతులమీద ఎక్కువ వసూలు చేయవచ్చును. కాంగ్రెసువారి ఆశయము ప్రకారం గ్రామ సంక్షేమము అనే పంచాయితీ గ్రామాలు నెలకొల్పాలని గదా? ఇప్పుడు పంచాయితీలలో 100 రూపాయిల నుంచి 200 రూపాయల వరకు డబ్బు వసూలు చేస్తున్నారు గదా? దానిని రు. 400 లో రు. 500 ల వరకు ఎందుకు పెంచకూడదు? అది పెద్ద మొత్తము అని అనుకోవలసిన అవసరములేదు. న్యాయము అనేది పంచాయతీలలో జరుగుతుందా అనవచ్చును. ఈ రోజులలో కోర్టుకువస్తే మటుకు న్యాయము జరుగుతోందా ఈ విషయము నేను కోర్టులలో చెప్పడానికి వీల్లేక పోయినా, ఇది మనము శాసనములు pass చేసే సభ కాబట్టి ఇక్కడ చెప్పవచ్చును. కోర్టులలో న్యాయములు అనేది జరగడము లేదు. ఇరువాగులవారు దొంగసాక్ష్యాలు తెస్తారు. జడ్జిగారికి కళ్లు ఉండవు చెవులు మాత్రమే ఉంటాయి. సాక్షులు చెప్పినమాటలపై తీర్పుచెప్పాలి. ఈప్రక్క ఆ ప్రక్క తిరగకుండా గానుగ ఎద్దులాగా రట్టులో తిరిగినట్లుగానే ఆ evidence విని అయన సాక్ష్యము చెప్పాలి. ఇద్దరూ distorted evidence ను తీసుకువస్తారు. ఆ evidence ను బట్టే తీర్పుచెబుతారు. దానిని legal justice అంటారు. Natural justice అక్కడ లభించదు. Technical points అక్కడ కూడా అడ్డువస్తాయి. ఈ technicalities అందుకు అక్కడ ఉపయోగిస్తాయి, న్యాయము రద్దు అవడానికి, జరగకపోవడానికి ఈ techincal rules పనికి వస్తాయి గనుక. నిజముగా న్యాయము జరుగుతోంది అని ఎవరైనా అనుకోగలమా? నేను 15యేండ్లనుంచి practice చేస్తున్నాను 100 కి 5 కేసుల్లో మాత్రమే న్యాయము ఏమైన జరుగుతుందేమో? Evidence ను బట్టి, Act ప్రకారము సాక్ష్యము విని, తీర్పుచెప్పే సందర్భములో కోర్టులో నా అనుభవమును బట్టి చూస్తే కాకి తెల్లగా వుండును అనే తీర్పేవస్తుంది, అందువల్ల కేవలం కోర్టులకు వెడితే న్యాయము జరుగుతుంది అని అనుకోవడము పెద్దపొరపాటు. గ్రామపంచాయితులకు ఆ గ్రామములో ఉన్న వ్యవహారాలు బాగా తెలుస్తూ ఉంటుంది. అందువల్ల అక్కడ న్యాయము జరుగుతుంది అను కోవడమునకు చాల అవకాశము ఉన్నది. అందువల్ల ఈ గ్రామపంచాయితీ కోర్టుల్లో court fees లేకుండా వీళ్లకు ఇంకా power ఎక్కువ చేసినట్లయితే బాగుంటుంది. అందువల్ల court fees ఎక్కువ చేయాలని ఈ Act పెట్టడం తప్పు అని మనవి చేస్తున్నాను.

అంతేకాకుండా సత్యనారాయణగారు, సుబ్బారావుగారు ఏదో "Dissent note పంపించారు. అది general terms లో ఉన్నది. సరిగా details మాకు కన్పించడములేదు" అని చెప్పారు. Details కూడా పూర్తిగా వ్రాశాము. మొట్టమొదట మా policy ఏమిటో తెలియపరచి, తరువాత కొన్ని వివరాలుకూడా యిచ్చాను. మంత్రిగారు బిల్లులోని clauses incorporate చేయడములో, ఏదైనా ఒక భూమి స్వాధీనముకోసము దావావేస్తే market value ప్రకారం, భూమియొక్క ఖరీదుమీద 3 వంతులు court fees చెల్లించాలని చెప్పారు. అసలు original బిల్లులో శిస్తుమీద 20 రెట్లు కట్టమన్నారు. సెలెక్టుకమిటీలో మెజారిటీ సభ్యులు market value మీద 3 వంతులు కట్టమన్నారు. ఇది చాలా దారుణమైన విషయం.

తణుకు, రామచంద్రపురము, తెనాలి ఇటువంటి తాలూకాలలో భూమి ఖరీదు 4 వేల రూపాయలు ఉన్నపుడు దీనికి 3 వేలమీద court fees కట్టాలంటే 300 రూపాయలు పైగా అవుతుంది. వాళ్ళు తెలివితక్కువవల్లనో, కర్మంచాలకనో మరల అప్పీలుచేస్తే 300 రూపాయలు మరలా కట్టాలి. Second అప్పీలు ఉన్నట్లయితే మరల 300 రూపాయలు కట్టాలి. ఇదంతా తిరిగి వాళ్ళు దావావేసినట్లయితే ఏ ఆస్తి కోసము దావావేశారో, ఆ ఆస్తి కిమ్మతు ఈ court fees కు సరిపోతుంది. ఇంకా stamp duty కి అవుతుంది. కోర్టుకువచ్చేవాళ్ళకు ఇంకా ఎన్నో ఖర్చులు ఉంటాయి. ఇదంతా ఎలాతీసుకురావడము, అనేకసార్లు వాయిదావేస్తే కాని విచారణ పూర్తికాదు. అసలు సివిల్ కోర్టులలో వెంటనే తీర్పులు జరుగవు. ఏండ్లతరబడి తిరుగుతూనేవుండాలి. అందువల్ల వ్యాజ్యం 1,000 ఏండ్లు, మనిషి 100 ఏండ్లు అనే సామెతకూడా ఉన్నది. ఆ సాక్ష్యంకోసం అనేక పర్యాయాలు కోర్టులచుట్టూ తిరుగుతూవుండాలి. వాడు కోర్టుకు వచ్చేటప్పటికి ఇంటివద్ద మజ్జిగయినా త్రాగనివాడు, ఇక్కడవస్తే బాసుంది, మైసూరు పాకు, వగైరాలు కావాలంటాడు. ఎప్పుడుకూడా ఒంటెద్దుబండిఅయినా ఎక్కనివాడు బస్సులు కావాలంటాడు, ఈ ఖర్చులన్నీ మనము చెప్పుకోవడానికి ఇష్టములేక పోయినా కోర్టులకువచ్చినతరువాత ఇవన్నీ తప్పవు. వసుదేవుడుకూడా గాడిదకాళ్ళు పట్టుకున్నాడన్నట్లు అలాగే అందరినీ బ్రతిమాలి సాక్షులందరినీ కట్టుకుంటూ రావాలి. ఈ ఖర్చులన్నీ కలసి మోపెడు అవుతాయి కాబట్టి వారికి ఒక్క court fees తోటే సరిపోదు. ఈ court fees ఇతర ఖర్చులన్నీ కలిసి చాలాఅవుతుంది. కాబట్టి ఈ court fees అనేది 3 వంతుల market value మీద పెట్టడము అనేది చాలా దారుణమైన clause అని చెబుతున్నాను. కొన్ని పరిస్థితులలో చాలా ఎక్కువ ధరలు ఉండవచ్చును. ఒక్కొక్కప్పుడు చాలా తగ్గవచ్చును. లేదా ధరలు తగ్గివున్న time లో కూడా ఎవరైనా వాని అవసరము కొలది ఎక్కువపెట్టి కొనవచ్చును. ధరలు తక్కువగా ఉన్నప్పుడు వాడి దరిద్రస్థితిలో చాలా తక్కువకు అమ్ముకోవచ్చును, ఆ అజూబాజూ రేటు ప్రకారము నిర్ణయించాలన్నప్పటికి కూడా సబబుఅని చెప్పడములేదు.

ఎప్పుడుకూడా ధరలు నిలకడగా ఉంటాయని చెప్పడానికి వీలులేదు. Assessment on the land అనేది ఉన్నది. అది ఏదో మనకు తెలియదు, దానికి ఇంత పన్ను అని ఉన్నది. దానికి 30 రెట్లుఅనో 100 రెట్లుఅనో పెట్టితే ఎంత యివ్వాలి అనేది కోర్టుకు వెళ్ళేవారికి తెలుస్తుంది.

ఈ market value అనేది ఒక పట్టణానికి నిర్ణయించడానికి వీల్లేనివిషయము. అందువల్ల un-certain పరిస్థితులలో దీనిని వదలి పెట్టడము అవుతుంది దీనినిగురించి ప్రత్యేకంగా enquiry జరగాలి. అందుచేత assessment ను basis గా తీసుకొని ఇన్నిరెట్లు కాకుండా ఇంకా ఎన్నిరెట్లు ఎక్కువ పెట్టిన చాల బాగుంటుంది. ఇట్లా ఎన్ని రెట్లు అని పెట్టినచో అది అందరికి తెలిసినపద్ధతిగా ఉంటుంది. దీనినిగురించి ఇంకొక ప్రధానవిషయము ఉన్నది. Court fees ను నిర్ణయించేవారు court వారేఅన్నారు. ఇది ప్రధానమైనటువంటి మార్పుగా చేశారు. ఇందులో అర్థము ఏమీలేదు. సాక్ష్యము అంతా పుచ్చుకుంటేనేగాని నిర్ణయించడానికి వీలులేకుండా ఉంటుంది. ఏదైన ఒక undivided property ఎవరైనా కొని, దానిని divide చేయాలని దావావేస్తాడు. మామూలు fixed court fees పెట్టాల్సి వుంటుంది. ఇప్పుడు దాని value మీద court fees కట్టవలసివుంటుంది. అదిఅంతా evidence లోకి వెళ్ళితేగాని తెలియదు. ముందుకట్టడానికి వీలులేదు. From time to time it is open to review by the same court అని ఇంకొక clause ఉన్నదని మంత్రిగారు చెప్పవచ్చును. అది మరీ అధ్వాన్నముగా ఉన్నది. market value 4 వేల రూపాయలు అని ఇదివరకు నిర్ణయించాము. దానిమీద ఈ court fees కట్టాలన్నట్లయితే ఆ మునసబుగారికి transfer అయిపోయినట్లయితే, ఇంకా బద్ధకస్తు మునసబువచ్చినట్లయితే ఒక కమీషనరును పంపించి రు. 5,000 వేయమని అన్నట్లయితే అ దావా sub-court కు వెళ్ళి పోతుంది. లేకపోతే ఆ మునసబే నెమ్మదిగా రు. 4,500, 6,000 అని పెంచుతూ ఉండవచ్చును. ఆ కోర్టే ఎప్పటికప్పుడు మార్చడము అయినట్లయితే దానికేమీ అర్థము ఉండదు. ఆ court fees మీద ఇచ్చిన తీర్పుమీద అప్పీలు చేయడానికి పార్టీకి హక్కు ఉన్నది. అట్లా అప్పీలుచేస్తే అది హైకోర్టువరకూ, సుప్రీంకోర్టువరకూ పోతు ఉండటంఅంటే అసలు విషయం మొదలే పోతుంది. అసలు ఈ ప్రశ్న తేలేవరకు ఉన్న విషయము ఏదో తెలియదు. ఈ court fees ప్రశ్నమీద merit దావా decide రాకుండా ఈ point మీద అప్పీలున్న వెళ్ళితే అసలువిషయము మొదలుకే పట్టుకుంటుంది. అందుచేత దీనిలో సబబు ఏమీ కన్పించడములేదు. అందువల్ల దానిలో కొన్ని ముఖ్యమైన మార్పులు చేస్తే సబబుగా ఉంటుందని మనవిచేస్తున్నాను.

అంతేకాకుండా suits to set aside attachment అని ఒక clause ఉన్నది. అందులోకూడా ఎంత మొత్తానికి అయితే ఆస్తి జప్తు చేశామో ఆ మొత్తము

మీదగా, జప్తు చేయబడిన ఆస్తియొక్క కిమ్మతుమీద 4-వ వంతు మనం court fees పెట్టి ఆ order ను set aside చేసుకోవడానికి దావావేసినప్పుడు వారు చెల్లించాలని ఉన్నది. ప్రతివాది ఆస్తి జప్తుచేశారు. ఎవరైనా claim పెట్టినట్లయితే ఆ ఆస్తి ఇతని స్వాధీనములో ఉంటుంది. ఇతని స్వాధీనములో ఉన్న ఆస్తి నాదిఅని చెప్పుకోవడానికి ground on title ఆస్తి తెచ్చుకోడానికి ఆస్తి కిమ్మతులో 4-వ వంతుమీద అంటే 4 వేల రూపాయలు ఖరీదుగల ఆస్తిజప్తు చేసుకొన్నట్లయితే 1000 రూపాయల కిమ్మతు మీద ఆ stamp duty కట్టాలి అంటే 110 రూపాయిలు stamp duty కట్టుకోవాలి. లేదా decree ఎంతమొత్తానికి అయితే జప్తుచేశారో, అంత మొత్తము మీదగాని, ఆ ఆస్తి కిమ్మతులో 4-వ వంతుగాని, ఏది ఎక్కువ అయితే అది అని ఆ Act అంతటిలో ఒక చోట ఉన్నది. ఏదోకొంత తక్కువ ఉండే పక్షములో, ఆస్తి స్వాధీనములో లేనివాడు stamp duty చెల్లించుకోవాలంటే అంతదారుణమైన విషయము. అతనికి ఆస్తి స్వాధీనములో లేదు. అతనికి కొత్తగా స్వాధీనము చేయమని అడుగుతున్నాడు. ఆస్తి ఏమైనా కొత్తగా సంపాదించడానికి దావా చేస్తుంటే ఏమైనా పెట్టమంటే అర్థము ఉన్నది గాని, అతని స్వాధీనములో ఉన్న ఆస్తి మట్టము అనో, స్నేహితుడు అనో అనుమానముమీదట, ఏదో కారణంమీద అవస్తపడుతూ స్వాధీనము చేయమని, declaration పెట్టమన్నప్పుడు అంత stamp duty పెట్టమనడములో సబబు ఏమీ లేదు. ఇలాగే కొన్ని కొన్ని మార్పులు సూచించడంలో బొత్తిగా అన్యాయముగా కనబడే వాటికి dissent note వ్రాసి ఉన్నాము. కాబట్టి ఇది ఏకగ్రీవంగా ఆమోదించడానికి వీలులేదు. రాజువారి చర్యలో మంత్రిగారు చెప్పినట్లు ఇంకా తప్పిస్లే వివరించి చెప్పడం అవుతుంది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—

అధ్యక్షా, ఈ బిల్లు మీ బోటి సామాన్యులకు అర్థం అయ్యేది కాదు. అచ్చుము రోజూ కోర్టులకు వెళ్ళేవాళ్ళయినా అయి ఉంటాలి. దీంట్లో రెండు రకాలున్నారు. కోర్టు పక్షులైనా కావాలి లేక pleaders అయినా కావాలి. లేకపోతే, ఎప్పుడూ వివాదాలలో ఉండేవాళ్ళయినా కావాలి. సామాన్యజనం విషయం తీసుకొన్నట్లయితే ఈ వేళ, constitution వచ్చిన తరువాత, ఏమైనా వారికి రక్షణ ఉన్నదా అంటే ప్రధానమైన Habeas Corpus అనేది High court లో ఒకటే ఉన్నది. ఇది అందరికి అందుబాటులో ఉండాలని చెప్పి ఇదివరకు 25 రూపాయలు మొత్తంమీద 35 రూపాయల వరకు ఖర్చు అయ్యేటట్లు పెట్టారు. కాని ఇది చూస్తే నూరు రూపాయలు అవుతుంది ఇక ఇతర ఖర్చులు అవన్నీ వేసుకొన్నట్లయితె, ఎంతవరకు పోతుందో ఊహించుకోవచ్చు. అసలు సామాన్యమానవునికి ఉన్నటువంటి రక్షణ ఏమైతే ఉన్నదో, constitution లో అది డబ్బు ఉన్నవానికి మాత్రమే ఉపయోగ

Sri Vavilala Gopalakrishnayya] [31st January 1956

పడుతుందే కాని డబ్బులేనివానికి ఉపయోగపడడాని వీలులేదు. అటువంటివారికి gate close చేసినటువంటి పద్ధతి దీంట్లో ప్రధానంగా అగుపడుతున్నది. కనుక దీనిని మాత్రము వ్యతిరేకించవలసిన అవసరమున్నది. రెండవది, "whichever is higher" అని పెట్టారు, co-opraeive bylaws లో "whichever is lower" అని ఉన్నది. ఇది ఏదో penalisation కోసమని రెండు లెక్కవేసి, ఇందులో ఏది ఎక్కువ మొత్తము ఉంటె దానిమీద పన్ను వేయవలసిందని చెప్పారు. మూడవది ఇంకొకటి ఉన్నది. అది ఎంత కట్టాలో కోర్టులో నిర్ణయించాలని చెప్పారు. ఆ నిర్ణయించేది గనుక అలస్యమయితే, సరిగా కోర్టువారు కోరినటువంటి time లో నిర్ణయించకపోతే కేసుపోతుంది అని వ్రాశారు. ఆ విధంగా ఉన్నది. అది క్లాజువారీగా వచ్చినప్పుడు చూపిస్తాను. శ్రీ భగవంతరావు గారు లేదంటున్నారు. ఉన్నది, చూపిస్తాను. value అనేది నిర్ణయించాలి. అది ఎవరు నిర్ణయిస్తారు? దాన్ని గురించే ఇందాక చెప్పారు. ఒక commission వేస్తారని ఆయన వెళ్లి విచారణచేస్తాడని చెప్పారు. అవసరం వచ్చినప్పుడే వేస్తారనుకోండి. ఇప్పుడు అనేక కోర్టులున్నాయి. కొన్ని విషయాలు నాకు బాగా తెలుసును. ఉదాహరణకు, ఒక కోర్టులో ఒక లాయరు ఒక తగాదాలో రెండు పార్టీలకు ప్లీడరుగా చేరాడు. తీరాచూసేటప్పటికి ఒక సందర్భంలో మాడు పార్టీలు ముఖాముఖిగా ఎదుర్కొనవలసి వచ్చింది. అందులో ఇతడు రెండు పార్టీలకు ఉన్నాడు తుదకు కేసువచ్చినప్పుడు ఆ ఇద్దరు తరఫున ఎవరివైపున వాదించాలో తేలక గైర్‌హాజరైనాడు. అందువల్ల ఆ యిద్దరిని అన్యాయము చేయడానికి ఉద్దేశించి ఆ విచారణ రోజుమాత్రను రాకుండా నాకు తలనొప్పిగా ఉన్నది రానుపొమ్మని అన్నాడు. ఆ తరువాత court లో appeal పెట్టేటప్పటికి time bar అయిపోయింది అన్నారు, పోనీ, అతను నాకు జబ్బుగా ఉంది అని ముందుగా చెప్పాడా అంటే లేదు. Client క్షేమా నీవు రానక్కరలేదు నేను వెళ్లుతున్నానని చెప్పాడు. అందుక client విశ్వాసంమీద కోర్టుకు వెళ్ళకుండా మానాడు. చివరకు కేసుపోయింది. నష్టపడినాక అతడు నా వద్దకువచ్చి చెప్పాడు నేను అతనితో ఒకటి చెప్పాను. విశ్వాసద్రోహంక్రింద ఆ pleader మీద కేసుపెట్టి నట్లైతే బాగుంటుందేమో, బహుశా practioners Act క్రింద అతనికి శిక్ష చెప్పడానికి వీలుంటుందేమో ఆలోచించండి అన్నాను. తుదకు అతని claim పోయింది. civil suit పోయింది Revenue suit పెడుతాను అంటున్నాడు. ఏది లేకుండా పోతుందనుకొంటాను. అట్లాంటివి కొన్ని జరిగినాయి. [illegible]కోసం చెప్పుతున్నాను. Commission విచారణచేసి value కట్టి ఆ value ప్రకారం అతనికి తెలియపరచాలి. ఒక వేళ ఆయన ఏదైనా అలస్యంచేస్తాడు అనుకోండి. అది కొంత ఆలస్యంగా వచ్చినట్లయితే ఆ కేసుపోతుందని చెప్పారు. అది ఈ విధంగా చెప్పారు. The plaint shall be rejected and the court shall pass such order as it deems just.' (11-వ క్లాసులో) దీంట్లో నాకు అర్థమయింది చెప్పుతున్నాను. ఏదైనా పొరబాటు ఉండే చెప్పండి, సర్దుకోడానికి తయారుగా ఉన్నాను. ఎందుకంటె ఇది law కు

సంబంధించింది. మేము తెలుసుకోవలెనని కోరికకూడా ఉన్నది. కనుక నాకు అర్థము అయినట్లు చెప్పుతున్నాను. "If within the time allowed the subject matter of the suit is not valued in accordance with the court's decision or if the fees is not paid the plaint shall be rejected and the court shalll pass such orders as it deems just regarding the cost of the suit" అని అందులో ఉన్నది. అంటె అసలు కేసు పోయిన తరువాత cost of the suit కు కూడ వారు నిర్ణయం ఇవ్వవచ్చు అని చెప్పితే, ఒకవేళ ఆ కేసు త్రోసివేసి ఇచ్చాళ్లనుంచి నీవు త్రిప్పినందుకుగాను అతనికి డబ్బు ఇవ్వవలసిందని అడగడానికి కోర్టుకు అధికారమున్నదని నేను అర్థముచేసుకొంటున్నాను. అది కాదు అన్నట్లయితే నాకు ఏమి అభ్యంతరంలేదు. నేను సవరించడానికి తయారుగా ఉన్నాను. ఆ rejection జరుగవచ్చు కాని మళ్ళీ పెట్టుకోవచ్చు అని అంటున్నారు. కాని rejection జరిగిన తరువాత మరల ప్రారంభిస్తే తగాదా అంతా afresh గా form అవుతుంది.

ఒకవేళ కాగితాలు ఉంచవచ్చు. కాని అప్పుడప్పుడు కొన్ని కేసులు reject చేశారనుకోండి. అప్పుడు reject చేశారనే, ఒక disqualification ఉంటుంది ఇతనిమీద. ఇతడు defaulter క్రింద కోర్టు దృక్పథములోకి వస్తాడు వీడు defaulter అని అన్నప్పుడు, వీడిమీద ఆ జడ్జిగాని, Munsif గాని, perejudice తో ఉండడు. అప్పుడు ఇతడు ఇంకొక pleader ను చూచుకోవలసియుంటుంది. ఇలాంటి చాలా ప్రమాదకరమైనటువంటిది షరతు అతనిమీద వేయకూడదు. రెండవది డబ్బుగనుక యివ్వకపోతే, valuation లో అది తగ్గిపోతుంది. తరువాత ఇస్తానన్నప్పుడు, అవి పాపర్ సూట్ అనుకొంటారు. బహుశ ఆ డబ్బు వసూలు చేసేటప్పుడు land revenue మాదిరిగనే వసూలుచేయాలని ఉన్నది. కాని అసలు డబ్బులేదు అతనివద్ద. ఆ పాపర్ సూట్ లో ఏమైన వచ్చేటటువంటి ఆస్తికూడా లేదు. మొత్తానికి గెలిచానని సంతోషిస్తాడు ఇంటికివచ్చినతర్వాత. వాడేమో కోర్టులో ఏడిస్తే, వీడు ఇంటికివచ్చి ఏడుస్తాడు. వాడు ఇంటికివచ్చినతరువాత అతడు చెల్లించవలసిన డబ్బు ఇవ్వమంటారు. కాని property లేకపోతే civil jail కు పంపిస్తారు, కొన్ని కేసులు నాకు బాగా తెలుసును. ఈ ఆర్థిక పరిస్థితులలో అతనికి అది చాలా preferable గానే వుంటుంది. ఎందుకంటె, నా కదిపోయింది, ఇదిపోయింది, రెండు నెలలపాటు నాకు ఆలోచించడానికి అవకాశము వుంటుంది అని, వెళ్ళుతాను అంటాడు. కాని civ.l jail కు అట్లాంటివాళ్ళను పంపించడము న్యాయము కాదు, దానిని మనం నిషేధించవలసిన అవసరమున్నది. మీకు కావలసివస్తే చాలా వుదాహరణాలు చెప్పుతాను. కనుక అటువంటిదానికి మీరు protection యివ్వవలసినటువంటి అవసరమున్నదని చెప్పుతున్నాను. ఆ తరువాత దీంట్లో fees general గా ఎక్కువచేయడము మాత్రం వుద్దేశించారు. ఎందుచేతనంటే, 20 లక్షల రూపాయలెక్కవస్తుందని.

అంచనా వేసినట్లుగా చంద్రమౌళిగారు ఇచ్చినటువంటి stasement లో వున్నది. మొత్తం మనకు surcharge, court fee రెండు కలిసి 80 లక్షలు వస్తాయి. అందులో దాదాపు 60 లక్షలు land revenue surcharge మీద వస్తుందని పత్రికలలో ఒక statement వచ్చింది. అదికాకుండా ఎంత వస్తుందో నాకు తెలియదు. అందువల్ల అంకెలు చెప్పితే పనివాలేదు. కాని చిన్న మొత్తాలు వస్తాయనుకొంటారా, అవి అసలు వేయడం అనవసరం, పోనీ పెద్ద మొత్తం వేస్తామంటారా, ఆ capacity ఎట్లుంది? ముఖ్యముగా పెద్దపెద్ద suits వున్నాయి పెద్దపెద్ద కేసులలో పోయినపుడు వేస్తే యేమి బాధలేదు. వీళ్ళేమైనా కొన్ని అవస్థలలో వుండవచ్చు ఆ స్థితివచ్చేవరకు ఆ స్థితి వచ్చినతరువాత ప్రభుత్వానికి వసూలు చేయడానికి అవకాశమున్నది. కనుక అప్పుడు వసూలు చేసుకొంటె ఎవరికేమిబాధలేదు. చిన్నచిన్న విషయాలలో ఇప్పుడు ఒక మనిషి పాలిటీలో తగాదావున్నదనుకోండి, లేక పంచాయితీబోర్డు ప్రెసిడెంటు తగాదా వున్నదనుకోండి. వీటి విషయంలో న్యాయానికి కోర్టుకు వెళ్ళాలి అన్నప్పుడు prohibitory charges 250 రూపాయలు, 150 రూపాయలు, 100 రూపాయలు 25 రూపాయలు పెడితే భరించడం కష్టం. అసలు వాడు ఈవేళ voter అయితే, మెంబరు కావడానికి వీలున్నది. ప్రజాదరణవుంటె, ఆ ప్రజాదరణవుండేవాడని technical కారణాలచేత త్రోసిపారేస్తే అతను కోర్టుకువెళ్ళాలంటె ఒక pleader ను సంపాదించుకోవాలి. అతనికి కొంత డబ్బు ఇవ్వాలి. దానికి గనుక prohibitory గా court fee పెట్టినట్లయితే, అది చాలా బరువైనదవుతుంది. ఖరీదైనదవుతుంది. ఎక్కువ ప్రియమైనదవుతుంది. ఎందువల్లనంటె న్యాయముగా వుండడమే ప్రతివాడు కోరుతాడు ఎప్పటికైనా. కనుక అది ఎక్కువ భరించలేనటువంటి ధరమీద వుండ కూడదు. న్యాయమనేది సమయంలో యివ్వకపోయినా, అందుకోవడానికి అవకాశం లేకపోయినా, justice is denied అని చెప్పవలసివుంటుంది. అందువల్ల delayed or denied ఈ రెండు ఒకటేఅవుతుంది. ఈ సందర్భములో ఇంకొకటి మనవిచేయ వలసియున్నది. దానిని Bombay assembly కూడ నిర్ణయించి ఒక కమిటీనివేసింది. వారు poor and deserving people కు వుచితముగా న్యాయం సహితంయివ్వాలి అన్నారు, ఆ విధంగా మన ప్రభుత్వం. మన High Court కూడా కోరింది. ఎవరైతే deserving poor అయి వుంటారో, ఈ Court fees గాని, pleader ను గాని పెట్టుకొనే సత్తాలేనివాళ్ళకు ప్రత్యేకముగా ఒక Bureau వేయవలసిందని Bombay Government ఒక కమిటీనివేసింది. బహుశా, ఆ కమిటీరిపోర్టునుకూడ మన గవర్నమెంటు considerచేస్తుందని విన్నాను. అది చాలా సంతోషము. క్రిందటితడవ ఇటువంటి తీర్మానము తెచ్చాను. అదేమైన ఆలోచిస్తావుంటే, ఇది అవసరమనుకొని మానివేస్తాను. కనుక న్యాయము కావాలన్నప్పుడు, అవసరమయినంత త్వరలో దాన్ని అందుబాటులో చేసినప్పుడే, న్యాయము కలుగచేసినట్లవుతుంది. అది అందుబాటులోవుండాలి. ముఖ్యంగా Constitution లో వుండే protection అల్లా executive వీటన్నింటికి అతీతంగా వెళ్ళగలిగింది, ఒక్క supreme

court, High Court మాత్రమే. కనుక వాటికి వెళ్ళేటటువంటి gates మాత్రము close చేయవద్దు. అది చాలా costly గా పెట్టవద్దు అని మనవిచేస్తున్నాను. దీన్ని సమగ్రముగా ఆలోచించవలసిందని కోరుతూ ఆ fees ఎక్కువగా చేయడము న్యాయము కాదని మనవిచేస్తున్నాను.

Sri D. KONDAIAH CHOUDARY :—

అధ్యక్షా, ఈ Court Fees Bill ను నేను సమర్థిస్తున్నాను. ప్రభుత్వమువారు తెచ్చిన ప్రతి విషయములోను ప్రతిపక్షసభ్యులు ఏమైనను మాట్లాడినప్పటికినీ, ఒకే దారుగా అడ్డుతూ మాట్లాడుతున్నారు. ఇప్పుడు ఈ Court Fees Bill విషయములోకూడా కోర్టులకు న్యాయము కోసము వెళ్ళవలసివచ్చినప్పుడు న్యాయము సంపాదించడములో యితర రాష్ట్రములలోవుండే సౌకర్యాలైనా యీ రాష్ట్రములో కలిగించకపోయినప్పటికినీ, కోర్టుఖర్చులు యెక్కువఅవుతున్నవనే మాటగా, యిదే ప్రధానమైన చార్జీగా లేవదీసిమాట్లాడుతున్నారు. వారు మాట్లాడే మాటలలో కోర్టులకువెళ్ళినప్పుడు ఖర్చులు జాస్తిగా అవుతున్నవని ముఖ్యముగా కనిపిస్తున్నది. కాని నాకువున్న స్వల్పఅనుభవము కొంచెముగా చెబుతున్నాను. ఈ విషయములో మాకువున్నంత అనుభవము గోపాలకృష్ణయ్యగారికి లేకపోవచ్చు. కోర్టులకువెళ్ళేవారికి ఖర్చులు ఎక్కువ ఎక్కువగా అవుతున్నవంటే, అనుభవముగలవారికే ఆ విషయము సరిపూర్ణముగా తెలుస్తుంది. కోర్టులకు వెళ్ళినపుడు వ్యాజ్యములయొక్క ఫలితము ఏ విధంగా వున్నప్పటికినీ ఖర్చులు ఎక్కువగా ఎందువల్ల అవుతున్నవంటె, కోర్టుఫీజు చెల్లించడమువల్ల కానే కాదు. కోర్టులకు రానుపోను ఖర్చులు, ప్లీడర్లకు యిచ్చే ఖర్చులు, ప్రతివాయిదాకు వెళ్ళినప్పుడు సాక్షులకు భత్యఖర్చులు, బండి చార్జీలు, యింకనువాళ్ళు చేసే యితర ప్రైవేటు ఖర్చులు యిటువంటివి అన్నీ చేరి ఖర్చులు ఎక్కువగా కనబడుతాయి కాని, నిజంగా కోర్టుఫీజువల్ల అయ్యే ఖర్చు ఎక్కువగా యేమీ కాదు. కొన్నికొన్ని కేసులలో నిజంగా అయ్యే ఖర్చులు అన్నీకూడ లెక్కవేసి చూస్తే కోర్టు ఫీజుకున్నూ, వారికి అయ్యే యితర ఖర్చులకున్నూ దాదాపు ఒకటికి నూరు రేషియోలో జరుగుతూవుంటూవుంటుంది. సివిల్ కోర్టు విషయములోనూ, క్రిమినల్ కోర్టు విషయములోనూ, వారికి అయ్యే ఖర్చులు, ప్లీడర్లకు వగైరాలకు, యింకను కేసులయొక్క ప్రాబల్యాన్నిబట్టి, వారి అవసరమును బట్టి ఎంతో ఖర్చు చేస్తారు. ఈ రెండింటిలోను ఖర్చుల విషయములో ఎంతో తేడా కనబడుతుంది. కోర్టు ఫీజు ఒక్కొక్క దావా విషయములో నూరురూపాయలు వుంటే ఖర్చులు అంతకు పది వంతులు అనగా వెయ్యిరూపాయల వరకూ అవుతాయి. కోర్టులకు చెల్లించే ఫీజు మినహా, యితర ఖర్చులు తగ్గించుకోవాలంటే యీ కోర్టులను ప్రజలకు ఎంత సమీపములో వుంటే, ఖర్చులు అంత తగ్గడానికి అవకాశమువుంటుంది. కోర్టులు సమీపములో వుంటే సాక్షులకుగాని, కక్షిదార్లకుగాని రానుపోను బండ్లచార్జీలుగాని, భత్యఖర్చులుగాని, యింకను వారు చేయవలసి వచ్చే యితర ప్రైవేటు ఖర్చులు తగ్గిపోవటానికి అవకాశాలు ఎన్నో వున్నవి. ఈ విధముగా చేయుటానికి కోర్టులను గ్రామాల మధ్య

పెట్టాలి. గ్రామాలమధ్య పెట్టాలంటే కోర్టులు ఎక్కువగా చేయాలి. ఎక్కువగా పెంచాలంటే ఖర్చు అవుతుంది. ఖర్చుచేయాలంటే, ప్రభుత్వానికి డబ్బువుంటేగదా, కోర్టులు ఎక్కువగా పెట్టడానికి వీలు అవుతుంది. ప్రభుత్వానికి డబ్బుకావాలంటే కోర్టు ఫీజు ఎక్కించకపోతే, యిక ప్రభుత్వానికి డబ్బువచ్చే మార్గము యేమిటో సభ్యులే గ్రహించాలి. కాబట్టి కోర్టు ఫీజు పెంచకూడదు అనే వాదన సరియైనదికాదు. అందువల్ల కనీసము ప్రతి తాలూకాకు సమీపములో వున్న కొన్ని గ్రామాలను చేర్చి అక్కడ ఒక కోర్టు ఏర్పాటు చేస్తే, కక్షిదారులు పేదవారుగా వుంటే వారికి సహాయ పడాలి అనే ప్రతిపక్షసభ్యుల వాదన కనుగుణముగా వుంటుంది. ఆ విధంగా చేస్తే, కోర్టులకు పోయేవారికి ఖర్చులు తగ్గుతాయి. దావాలుకూడా ఎక్కువ తొందరగా పరిష్కారము కాగలవు. ధర్మముకూడ సులువుగా దొరుకుతుంది. ఈ విధముగా చేయ కుండా మూడు తాలూకాలకు, ఒక కోర్టు నాలుగు తాలూకాలకు ఒక కోర్టు పెట్టి నట్లైయితే, యిక యీ కక్షిదార్లకు ఖర్చులు జాస్తి అవుతాయి అంటే, ఎందువల్లకావు? కోర్టులు దూరముగా వుండడమువల్ల ధర్మము సులువుగా దొరుకుతుందని అనుకోవడము భ్రమ అని అంటాను. కోర్టు ఫీజువల్ల అయ్యే ఖర్చుకున్నూ, కక్షిదార్లకు అయ్యేఖర్చు లకున్నూ ఎలాంటి సంబంధము లేదు. కాబట్టి ప్రభుత్వానికి డబ్బు కోర్టు ఫీజుమూల ముగా చేకూర్చించి, యింకా ఎక్కువగా కోర్టులు పెట్టేటట్లు పాటుపడితే, నిజంగా కోర్టులలో జరిగే దావాల విషయములో justice cheap గా కూడ దొరుకుతుంది. కాబట్టి యీ కోర్టు ఫీజు బిల్లును ప్రతిపక్ష సభ్యులు ప్రతిఘటించకుండా ప్యాసు చేయించడము మంచిదని మనవిచేస్తున్నాను.

తరువాత కోర్టుఫీజు సెటిల్ చేసేవిషయములో భూమియొక్క విలువనుబట్టి చేయవలసివుంటుంది అనే సమస్య వుంటున్నది. ఈ విలువ విషయములో ప్రతిపక్ష సభ్యులకు అభ్యంతరము వుంటున్నట్లు తెలుస్తున్నది. ఈ విషయము select committee లో వున్న అన్ని పక్షములవారు అనగా స్వతంత్రపక్షసభ్యులు, సోషలిష్టుసభ్యులు, కాంగ్రెసువారు, ప్రతిపక్షములోవున్న కమ్యూనిష్టుసభ్యులు అందరూ చేరి దీర్ఘంగా చర్చించినమీదనే, ఏదో via media policy ని అందరూకూడా కలిసి ఏకగ్రీవముగా ఒక అభిప్రాయానికి వచ్చి తేల్చిన విషయమే యిది. పోతే యెవరో కొంతమందిసభ్యులు మొదట ఒప్పుకున్నట్లుగా ఒప్పుకుని, తరువాత ఏదో dissenting minute పంపి నట్లుగా నాకు తెలిసింది. కానీ యీ విషయము వారు select committee లో వుండి తీవ్రముగా ప్రతిఘటించినట్లుమాత్రము కన్పించదు. దీనికి కారణము యేమిటంటే కోర్టు ఫీజు సెటిల్ చేసేటప్పుడు moveable properties విషయములో ఏవిధమైన పేచి పెట్టలేదు. ఇక స్థిరాస్తివిషయములో ఏదైనా అభ్యంతరము లేవదీసివుండవచ్చు. మనము ఏ ఆస్తికొరకుఅయితే దావావేస్తున్నామో దానియొక్క నిజమైన విలువను కనుక్కో వలసిన మార్గాలు అనేకముపెట్టారు. Disputed property కి విలువకట్టాలంటే అనేక మార్గములువున్నవి. మంత్రిగారుచెప్పినట్లు ఆస్తివిలువకట్టేసందర్భములో

1870-వ సంవత్సరములో ఒక పద్ధతి ప్రవేశపెట్టారు. అప్పటి పద్ధతికిన్నీ, యిప్పుడుజరిగే పద్ధతికిన్నీ చాలా తేడావుంటున్నది. అప్పటి ధరలకు యిప్పుడువున్న ధరలకు చాలా తేడావున్నదని సభ్యులు ఒప్పుకోకతప్పదు. పూర్వపు ధరలు చాలా తక్కువ, ఇప్పటి ధరలు చాలా ఎక్కువ. అందువల్ల difference చాలా వుంటున్నది. ఇప్పుడు భూమి శిస్తువున్నది. దానిమీద యాభైరెట్లు ఎక్కువకట్టాలని అంటున్నారు. ఒక ఎకరా భూమికిగాను దావాచేస్తే దానిమీద వేసేశిస్తుకు యాభైరెట్లు అంటే పదిరూపాయలు శిస్తువుంటే, దానికి యాభైరెట్లుఅంటే, అప్పుడు అది 500 రూపాయలు అవుతుంది. అదే భూమి యిప్పుడు ఎకరా ఒకటింటికి నాలుగువేలు, అయిదువేలువున్నది. 1870-వ సంవత్సరములో ఒక ఎకరాకు శిస్తు పదిరూపాయలువున్నను ఖరీదు 500 రూపాయలు వున్నది. అలాంటిది అదే శిస్తు యిప్పుడు వున్నను ఖరీదుమాత్రము అయిదువేలరూపాయలదాకావుంటున్నది. కాబట్టి అప్పుడువున్న పరిస్థితులలోను, యిప్పుడువున్న పరిస్థితుల లోవలె శిస్తు ఒకటేఅయినను, భూమికి విలువసరిపోయింది. కాని యీ రోజునవున్న భూమి ఖరీదు ఎకరా ఒకటింటికి 3 వేలరూపాయలువుంటున్నప్పుడు, ప్రతిపక్షసభ్యులు చెప్పిన assessment ప్రకారము చూచినప్పుడు అయిదువందలరూపాయల విలువ కనబడుతున్నది. ఈ రకంగా కృత్రిమమైన విలువనుకట్టి, దానిమీద కోర్టుఫీజు చెల్లించాలంటే, అది న్యాయమాఅని అడుగుతున్నాను. అది గమనించకుండా నూరు పరసెంటు, రెండువందలపరసెంటు అభివృద్ధి చేశారు అని చెప్పినట్లయితే, అది కేవలము హాస్యాస్పదమైన లెక్కలేగాని, నిజానికి ఒకవస్తువుయొక్క విలువ కనుక్కోవాలనివుంటే. మార్కెటు value తప్ప, మరొకవిధముగా కనుక్కోటానికి వీలుండదు. అదిగాకుండా యిప్పుడు towns లో వుండే యిళ్లకుగాని, మరి garden lands కు గాని Market value మీదనే కోర్టుఫీజు చెల్లిస్తున్నారుగాని, భూములవిషయములో మాత్రము యింకొక విధముగా చెల్లిస్తున్నారు. ఇవిఅన్నీకూడా గమనించి ప్రభుత్వము వారు మార్కెటువాల్యూఅంటున్నప్పుడు వీటికి వాటికి అన్నింటివిషయములో పూర్తిగా న్యాయముకలిగేటట్లుగా, అవి యిళ్ళుగానివ్వండి, లేక garden lands కానివ్వండి, భూములుకానివ్వండి అన్నింటివిషయములోనుకూడ సమానముగా 75 పరసెంటు మార్కెటువాల్యూమీద నిర్ణయించివేస్తే అన్ని విషయములలోను ఒకేరకముగా విధించి నట్లవుతుంది. ఆవిధంగాకాకుండా ఇళ్ళ విషయములో ఒకరకముగానూ, garden lands కు ఒకరకముగాను, భూములకు యింకొకరకముగాను movable properties కు మరొకవిధముగాను court fees నిర్ణయించకూడదు. వేటివిషయములోనూగూడ discrimination అనేది వుండకూడదని నా అభిప్రాయము. అన్నిటికి ఒకేరకమైన court fees విధింపువుంటే న్యాయముగావుంటుంది. కృత్రిమమైన వాల్యూకట్టకుండా నిజమైన మార్కెటువాల్యూ నిర్ణయించి విధించాలి. ఇదే సెలెక్టుకమిటీవారుగూడ నిర్ణయించారు. కాబట్టి యిది న్యాయమైన రేటేననే అభిప్రాయముతో మనవి చేస్తున్నాను.

తరువాత మన మిత్రుడు సుబ్బారావుగారు నాలుగువందల రూపాయలవరకు పంచాయితీకోర్టులకు jurisdiction యిచ్చి కేసులు నడిపించవలసిందిగా సలహా యిచ్చారు ఈ రోజులలో పంచాయితీబోర్డులుగాని, పంచాయితీకోర్టులుగాని, ఏవిధముగా పరిపాలించబడుతున్నవో మనకందరికి తెలిసినవిషయమే. అక్కడ గ్రామాలలో ఏరకమైన అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నవో నేను ఎక్కువగా వివరించపనిలేదు. ఏ ఒక్క దావా దాఖలుచేసినప్పటికీనీ, అక్కడవుండే పార్టీలనుబట్టి, న్యాయముజరగదని transfer కోరటానికి ప్రయత్నించుచున్నారు. పంచాయితీకోర్టులలో పనిచేసే సభ్యులు గ్రామాలలోవుండేవారే. గ్రామాలలో పార్టీతగాదాలువున్నప్పుడు, యిక యీ దావాలు అన్నియూ, పార్టీ బేధాలులేకుండా నిర్వర్తించి, న్యాయముపాలించుతారన్న నమ్మకములేదు. ఆ విధమైన నమ్మకము లేనందువల్లనే, వేసిన ప్రతిదావాను గూడ transfer చేయుటకు దరఖాస్తుచేయబడుచున్నది. ఈ విధముగా transfer కు పెట్టుకున్నప్పుడు, వాటివిషయములో మరలా ఖర్చు తప్పదు. కాని కనబడవు. దావాలు పరిష్కారముకావు. ఎటుచేరి కోర్టులకు వెళ్ళవలసిందే. న్యాయమో, అన్యాయమో, కోర్టులలో సెటిల్ కావలసిందేగాని, పంచాయతీకోర్టులలో యీ కేసులు పరిష్కారముఅవుతాయనే నమ్మకము వుండదు. ఇప్పటికే కొద్ది jurisdiction తోనే తగాదాలు వుంటున్నవి. ఇక నాలుగువందలరూపాయల jurisdiction పెట్టినట్లయితే పరిస్థితులు యింకా పెచ్చుపెరిగి, మరీ అధ్వాన్నముగా వుంటాయని నమ్మండి. అయితే మునసబుకోర్టులలో మాత్రము న్యాయముకలుగుతున్నదాఅంటే, యిక్కడగ్రామాలలో వుండేవారు, అక్కడ పంచాయతీకోర్టులలో మెంబర్లుగా వుంటుంటారు. వారికి పార్టీ అభిమానమువుండదంటే నమ్మగలరా. డిస్ట్రిక్టుకోర్టు మునసబుఅయితే ఏపార్టీకి చెందినవారుగా వుండరుకాబట్టి కొద్దో గొప్పో, న్యాయము జరగటానికి అవకాశమువుంటుంది. తనవద్దకు తెచ్చిన సాక్ష్యమునుబట్టి అయిననూ న్యాయముచేస్తారన్న ఆశ కక్షిదార్లకు కలుగుతుంది. పైగా మునసబు స్వతంత్రుడుగా వుంటారు. ప్రభుత్వోద్యోగి ఇక్కడ పంచాయతీకోర్టులలో ఉన్నవారు ఉద్యోగస్థులుకారు. పైగా పార్టీఅభిమానులుఅని చెప్పవలసివున్నది. పంచాయితీకోర్టులకు యిస్తే పని జరగదు. పైగా ప్రతిదావాకూడా transfer కాకతప్పదు. నేనుగూడ పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగావున్నాను గనుక నేను దాని ఫలితములు అనుభవిస్తున్నాను. స్వానుభవమున నేను యీనాడు చెబుతున్నాను. ఈ విషయములో పట్టుదలచూపించడముమంచిదికాదు. పంచాయితీబోర్డులకు మాత్రము యీ దావాలు అప్పచెప్పకూడదు. justice తారుమారుఅవుతుందని ఖచ్చితముగా చెబుతున్నాను.

తరువాత మార్కెటువాల్యూ illusive గా వుంటుంది, అందువల్ల దానిమీద ఆధారపడివుండడము సబబుగాదు, అని సుబ్బారావుగారుచెప్పారు. నేను మనవిచేసేది యేమిటంటే, మార్కెటువాల్యూ illusive గా వుండాలనే నా అభిప్రాయము. ఈ రోజులలో భూములకు మార్కెటువాల్యూ ఏరకంగావుందో చూడండి. ఇప్పుడువున్న

మార్కెటువాల్యూమీదనే కోర్టుఫీజు విధించాలని అంటాను. మార్కెటువాల్యూ మారినప్పుడల్లా, ఈ కోర్టుఫీజు మారాలి. రేపటిరోజున ధర పెరగవచ్చు, తగ్గవచ్చు. ఏనాడువుండే మార్కెటువాల్యూమీద ఆ దావా భూమివిషయములకు కోర్టుఫీజు నిర్ణయించాలిగాని, మరొకవిధము పనికిరాదు. ధర హెచ్చినా, తగ్గినా దానిమీద ఏ యాభైరెట్లో, నూరురెట్లో నిర్ణయించివేయాలి. అప్పుడు ప్రభుత్వానికి డబ్బు చేకూరే అవకాశము లభిస్తుంది. అంతేకాని fixed rate మాత్రము వుండకూడదు. డబ్బు చేకూరటానికి మార్గములేదు. దురదృష్టవశాత్తు యీ రోజున మూడువేలు ఖరీదు చేసే భూమి రేపటిరోజున అయిదువందలరూపాయిలే కావచ్చు, ఆరేటువున్నప్పుడు దానిమీద నూరురెట్లు assessment అన్నప్పుడు 100 × 10 గాని, లేకపోతే 50 × 10 గానిఅయితే అప్పుడు మార్కెటువాల్యూ అయిదువందలే అవుతుంది. అందువల్ల యీ ధరకూడ హెచ్చుతూ, తగ్గుతూ వుంటుంది. దానిప్రకారము కోర్టుఫీజు నిర్ణయిస్తే న్యాయముగా వుంటుంది కాని, fixed rate నిర్ణయించడము మంచిది కాదు. రేపు భూములకు ధరలు తగ్గేటట్లయితే, కోర్టులకుపోయేవాళ్ళకు యీ fixed rate ను నిర్ణయించే కోర్టుఫీజువల్ల చాలా బాధకరముగా వుంటుంది. అందువల్ల కోర్టుఫీజు నిర్ణయము భూములయొక్క ధరలనుబట్టి నిర్ణయించడము న్యాయము. ధరలుతగ్గితే, ఫీజు తగ్గుతుంది. ధరలు పెరిగితే ఫీజు పెరుగుతుంది. ఈ విధమైన పద్ధతినే ప్రభుత్వము అవలంబించాలని అంటాను. కాని ఒకే పద్ధతిమీద నిర్ణయిస్తే, రేపు ధరలు తగ్గినప్పుడు ఒకబాధ, హెచ్చినప్పుడు యింకొకబాధ, కాబట్టి, fixed rate కాకుండా flexible గా వుంటె మంచిదనిన్నీ, అదే న్యాయపద్ధతిఅని అంటున్నాను.

మరొక విషయము – గోపాలకృష్ణయ్యగారు చెప్పింది యేమిటంటె, కక్షిదారుడు కోర్టుఫీజు కొద్దిగా చెల్లించి తక్కినది చెల్లించకపోతేగాని, దావాలు త్రోసివేయబడుతున్నాయి. ఆ విధంగా కోర్టుఫీజు చెల్లించక పోయిన పరిస్థితులలోగూడా దావాలు కొట్టివేయకూడదు, దావాలు పరిష్కారము చేసేటట్లు చూడాలని అన్నారు. ఆ విధంగా చేస్తే కక్షిదారుడుగానుండు ప్రతి వ్యక్తిగూడ అసలు కోర్టుఫీజే కట్టరు అందరు కట్టకుండానే దావాలు జరపాలని కోరుతారు. అప్పుడు ప్రభుత్వానికి ఖర్చు తప్ప డబ్బువచ్చే మార్గము యేది? అందువల్ల దావాలకు వెళ్ళిన ప్రతివాడుకూడ కోర్టు ఫీజు చెల్లించవలసిందే, కోర్టు ఫీజు చెల్లిస్తేనే, ఆ దావాలు విచారించి పరిష్కారము చేయాలిగాని ఫీజుకట్టినా కట్టకపోయినా, దావాలు విచారణ – తీర్పు జరగవలసిందే కొట్టివేయకూడదు అని చెప్పడము సమంజసము కాదు. కోర్టు ఫీజు కట్టకపోతే దావాలు త్రోసివేయవలసిందేనని అంటున్నాను. ఒకవేళ కక్షిదారుకు డబ్బు లేకనో, ప్లీడరు డబ్బు తినేవాడుగావుండి, కోర్టు ఫీజు క్రిందయిచ్చిన సొమ్మును ఆయన తినివేసి కూర్చుని, కోర్టు ఫీజు కట్టకపోయినా, లేక యింకొక యితర కారణము చేతనైనా, కోర్టు ఫీజు చెల్లించనందువల్ల, దావాకొట్టి వేస్తే, దానికి revision petition పెట్టుకొని దావాను restore చేయించుకోవచ్చుగాని, కోర్టు ఫీజు కట్టకుండా మాత్రము

దావాలు జరపకూడదనే నా అభిప్రాయము. అట్లుచేస్తే డబ్బువున్నవారు మాత్రము కోర్టు ఫీజు చెల్లిస్తారా? కోర్టు ఫీజు చెల్లించకుండానే, డబ్బువున్నవాడుకూడ దావాలు జరిపించుకోవాలనే ఉద్దేశిస్తాడు. కాబట్టి గోపాలకృష్ణయ్యగారు చెప్పినది సబబు కాదని అది సక్రమమైన పద్ధతి కాదని మనవి చేస్తున్నాను.

ప్రాథమిక హక్కులను రక్షించడానికి ఈనాడు High Court లో writ లు దాఖలు చేస్తారు. దానికి రు. 20/- ఫీజు ఉంది. కోర్టు stalistics తీసుకుంటే ఈ రోజున మన హైకోర్టులో రిట్ దరఖాస్తులు 4000 దాకా ఉన్నాయి. వానిని న్యాయంగా పరిష్కరించాలని అంటే రెండు హైకోర్టులు ఉంటేగాని సక్రమముగా పరిష్కారం కావు. ఈ పరిస్థితులలో court fee prohibitive గా ఉంటేగాని లాభము లేదు. అందు కు ఫీజు 100/- చెయ్యడం జరిగింది. ప్రాథమిక హక్కుల కోసము న్యాయమైన హక్కుల కొరకు లేక ఎవరంటేవారు ప్రతి చిన్న విషయానికి హైకోర్టుకు పోతే రిట్ హక్కును దుర్వినియోగం చేస్తూ ఉంటే ప్రభుత్వడబ్బు ఈ విధంగా దుబారా ఖర్చు చేస్తూ ఉంటే నిరోధకచర్యగా రుసుము పెంచవలసివచ్చింది. న్యాయమైన, సక్రమమైన case లను గురించి writs వచ్చినపుడు రుసుమునుతగ్గించుకోవచ్చు. ఇపుడు మన దేశపరిస్థితులను బట్టి ప్రతిస్వల్ప విషయంలోనూకూడా హైకోర్టుకు పరిగెడుతూ ఉన్నాము; రుసుము 20/- కదా అని, హైకోర్టుకు కాలాన్ని వృథా చేస్తున్నారు. అట్లా కాకుండా చెయ్యడానికి ఇది అవసరం వచ్చింది అని మనవి చేస్తున్నాను. క్రిమినలు కోర్టు వ్యవహారాల గురించి మార్పువచ్చింది. క్రిమినలు కంప్లెయింటుకు fees రు. 2/- అన్నారు. ఇది సమర్థిస్తున్నాను. మంత్రిగారికి చెప్పాను. Stationery Sub-magistrate కోర్టులకు పురాతనంనుంచి ఒక హుందాతనం ఉండేది. Dignity ఉంటేగాని విలువ ఉండదు. ఈ రోజున S. S. M. కోర్టుచూస్తే చాలా బాధకలుగుతుంది. రివెన్యూ నుండి విభజన చేసినపుడు judiciary కి పాడుపడి పోయిన బెంచీలు, కుర్చీలు ఇచ్చారు. క్లైయింట్లకు షెడ్డులులేవు. Library లేదు, ప్లీడర్లకు Bar room లేదు. ఈ అధ్వాన్న పరిస్థితులతో ఉన్న కోర్టులను అభివృద్ధి పరచడానికి డబ్బు కావలెను. క్రిమినలు కంప్లెయింటుకు రెండురూపాయిలు, వకాలతుకు రెండు రూపాయిలు ఇస్తున్నాము. ఈ నాలుగు రూపాయిల ఖర్చు భారము అని చెప్పడం చాలా హాస్యాస్పదము అని చెపుతున్నాను. మర్డరు కేసులో ఒక కేసుకు 10,000 దాకా ఖర్చు పెడుతూ ప్లీడరుకు రు. 400, రు. 500 ఇస్తున్నప్పుడు కోర్టుకు ఈ 4 రూపాయిలు ఇవ్వడం న్యాయమే అని చెపుతున్నాను. ఏమి తప్పు ఉన్నదో నాకు అర్థము కావడంలేదు. క్రిమినలు కోర్టుల అభివృద్ధికి ఇది ఉపయోగించవచ్చును.

ఇప్పుడు క్రిమినలు కోర్టులు రెండు తాలూకాలకు ఒకటి చొప్పున ఉన్నాయి. ఈ వచ్చిన డబ్బుతో దగ్గరగా అందుబాటులో కోర్టులు పెడితే న్యాయము జరుగుతుంది. ప్రతి తాలూకాలో ఒక క్రిమినలు కోర్టు ఏర్పాటు చేస్తే అక్కడ ఉంటే

ప్లీడర్ల ప్రాక్టీసు మన స్వత్వం న్యాయాధికారులను తెలుస్తుంది. న్యాయం ఎక్కువగా జరుగుతుంది. కోర్టులు ఎక్కువగా పెడితే justice cheap గా లభిస్తుందని మనవి చేస్తున్నాను.

Adoption suits విషయంలో ఆస్తియొక్క మొత్తం విలువలో సగముపైన court fees చెల్లించమనడములో అన్యాయమేమీలేదు. అయనకున్నది unearned income అని సెలక్టుకమిటీలో చెప్పాను. పిల్లకాయలులేక పారలౌకికక్రియలు చెయ్యడానికి ప్రక్కగ్రామంనుండో 10, 12 మైళ్ళదూరంనుండో తెచ్చుకుంటాడు ఒక కుర్రవాడిని. ఆస్తి అనవసరంగా తినేటప్పుడు ½ లేక ¾ State కు ఇచ్చినానష్టములేదు. అందుచేత దాని మార్కెటు value లో 75% మీద రుసుము తీసుకోవలసినదని నేను చెప్పుతున్నాను. Civilised society లో unearned income నుంచి State ఎక్కువ తీసుకోవలెను. కమ్యూనిస్టులు, సోషలిస్టులుకూడా ఇందుకు ఒప్పుకుంటారు. కాబట్టి adoption suits లో 75% పై court fees తీసుకుంటే ఎక్కువఆదాయంవస్తుంది. అడాప్షను చేసుకోబడ్డ ఆయన ఏవిధముగా కష్టపడలేదు కాబట్టి ఆ 75% పై courtfees తీసుకోవాలని మనవిచేస్తున్నాను. దానిని ఏకగ్రీవముగా ఆమోదించవలెను. క్లాజువారీ డిస్కషన్ వచ్చినపుడు ఇంకా వివరములు చెప్పవచ్చును. కాబట్టి అందరు ఏకగ్రీవముగా ఆమోదించవలెను అని మనవిచేస్తున్నాను.

**Sri S. K. V. KRISHNAVATARAM :—**

అధ్యక్షా, ఈ బిల్లును సమర్థించాలో వ్యతిరేకించాలో నాకు అర్థముఅవడములేదు. ఇది మామూలుగా వచ్చే amendment మాత్రమే కాక ఒక consolidated Act గా కూడా ఉన్నది. ఇట్టి పరిస్థితులలో, ఇంత త్వరలో ఇది ప్రజాభిప్రాయానికి పంపకుండా తరువాత ఇష్టముతో ఉన్న Bar Associations యొక్క అభిప్రాయం కూడా సేకరించకుండా ఒక సెలక్టుకమిటీకి మాత్రం పంపి ఆ కమిటీ అభిప్రాయము మాత్రము తీసుకొని మనముందుకు ఇలాంటి Drastic chamges తో ఈ బిల్లు తీసుకురావడం చాలా విపరీతమైన విషయము. ఇప్పటికైనా ఈ బిల్లును ప్రభుత్వం ఉపసంహరించుకొని రాష్ట్రములోఉన్న Bar Associations యొక్క అభిప్రాయాలను, ప్రజాభిప్రాయాన్ని దానితో clients, Bar Associations ప్లీడర్లకుసంబంధించిన విషయము, constitution కు సంబంధించిన విషయము, హైకమాండుయొక్క ఉద్దేశముకూడా elicit చెయ్యవలసిన అవసరము ఎంతైనాఉంది. మనకు ప్రత్యేకరాష్ట్రం వచ్చినతరువాత ఈ విధమైన consolidated Bill ను, Original Act ను తీసుకొంటున్నాము. కాబట్టి ఏవిధముగా చేస్తే బాగుంటుందో ప్రభుత్వానికి సలహాయిస్తున్నాను. ఇది కేవలం Fiscal enactment అయినప్పటికి ఇది ఒక Taxation measure క్రింద, Revenue deriving, profit deriving measure గా యెంచడం యెంతమాత్రము మంచిపని కాదు, న్యాయము కాదు. మనము భారతీయులము భారతదేశములో పుట్టాము, పూర్వపు హిందూరాజులు పరిపాలన చేసినపుడు వ్యక్తికివ్యక్తికి

మధ్యవచ్చిన తగాయిదాలనుగురించి విచారించి న్యాయము చెప్పడం ప్రభుత్వము ధర్మము. ఇప్పుడు మనము ప్రజారాజ్యములో ఉన్నాము, మనకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత ఈ విధమైన విషయాలలో ప్రజలందరకును న్యాయాముగా, చౌకగా, కష్టములేకుండా, ధనవ్యయంలేకుండా న్యాయంచెప్పవలసిన బాధ్యత ప్రభుత్వంమీద వుంది. అలాంటి యంత్రాంగాన్ని నిర్మించే బాధ్యత ప్రభుత్వంమీద ఉంది. అటువంటిది మన భారతదేశములో ప్రభుత్వానికి కార్య భారములు ఎక్కువ అయినతరువాత ప్రత్యేకముగా బ్రిటిషువారు మన దేశములోకివచ్చినతరువాత వారిపరిపాలనాయంత్రము వారి ఆధీనములో ఉండగా కోర్టుఫీజు చెల్లించడం అనేది తీసుకువచ్చారు. ఇప్పుడు పరిపాలనాభారము ఎక్కువఅయింది. పూర్వముకంటెకూడా ఇప్పుడు చాలా complicated machinery పెరిగింది. కాబట్టి యిప్పుడు కోర్టుఫీజునుకూడా పెంచుచున్నామని అంటున్నారు.

ప్రభుత్వానికి Revenue సమకూర్చే శాసనాలు కొన్నింటిని pass చేశాము. యింకాకొన్నింటిని మనం pass చేయబోతున్నాం. ప్రభుత్వానికి డబ్బు కావాలనేదే ఇందుకు ముఖ్య కారణం. కాని యీ court fees bill ను సవరణ చేయడంలోకూడా అదృక్పథంతో వ్యవహరించడం ఎంత మాత్రమూ సమంజసమైన పనికాదు. కాని దురదృష్టవశాత్తు select committee లో న్యాయవాదులు చాలామంది వున్నప్పటికీ వారు యీ రాజకీయాల్లలో పడడంవల్ల కోర్టులకు పోయే ప్రజల వాస్తవిక పరిస్థితులు గమనించక పోవడంవల్ల ప్రజలు కష్టపడే పరిస్థితులు తెలిసికోక పోవడంవల్ల యిలాటి change అంగీకరించడం అనేది జరిగింది. ఇది చాలా విచారకరమైన సంగతి. కొండయ్య చౌదరిగారు ఈ Bill ను సమర్థించడం నాకు చాలాకష్టమయింది. ఆయన యొక్క ఏ అభిప్రాయంతోనూ నేను ఏకీభవించలేను. Civil, criminal court లలోని నాకున్న 20 సంవత్సరాల అనుభవాన్ని పురస్కరించుకొని నేను చెబుతున్నాను. వాస్తవిక పరిస్థితులలో చూసినపుడు ఆయన యొక్క reasoning ఎంతమాత్రం సవ్యం అయినది కాదని, సమర్థనీయమైనది కాదని, నేను మనవి చేస్తున్నాను. విశ్వనాథం పంతులుగారు Law Minister గా వున్నప్పుడు చాలాసార్లు ఈ court fees తో వచ్చే డబ్బు మీ court building, court furnitures కు ఖర్చు పెట్టాలని" చెప్పేవారు. ఆ విధంగా చేసినాకూడా surplus ఉంటుందని చెప్పేవారు. ఇప్పుడు ఏదో court fees ఎక్కువ చేసినట్టయితే తాలూకాకు ఒక court వస్తుంది, Registrar కూర్చోటానికి Dias లేదు, మాకు కుర్చీలులేవు అనే ధోరణిలో శ్రీ కొండయ్య చౌదరిగారు చెప్పడం అర్థరహితంగా వున్నది. ఇవి చేయడానికి ప్రభుత్వానికి ఉన్న డబ్బే చాలు. ప్రభుత్వానికి కోర్టులపై శ్రద్ధ లేక పోవడమే ఈనాటి పరిస్థితికి కారణం. ఏదో Judges ను వేశాము, Registrars ను వేశాము వున్న buildings లో వాళ్ళే ఏదో చేసుకుపోతున్నారు, అని సంతోషపడడం సబబు కాదు. ఇప్పుడున్న court fees లోని surplus amount లో courts యొక్క

buildings కు litigants కు lawers అధికారులకు మామూలు సౌకర్యాలు కలుగజేయడానికి ఎంతయినా అవకాశం ఉన్నది. ఇందులో పెద్దపెద్ద changes ఏవి వచ్చాయో మిత్రులు కొండయ్య చౌదరిగారు సుబ్బారావుగారు చెప్పారు. Court, అనగానే court fees తోటి, pleaders యొక్క fees తోటి సంబంధించిన వ్యవహారంగా మాత్రమే భావించకూడదు. చాలా ఖర్చులున్నాయి. pleaders కు యిచ్చే డబ్బు, court fees కు యిచ్చేడబ్బు కంటె ఇతర ఖర్చు చాలా ఎక్కువగా వుంటుంది. సాక్షులను తీసుకు వచ్చే నిమిత్తం ఖర్చువుతుంది. Interlocutory applications వస్తూంటాయి. వాటికికూడా fees లు పెంచారు. వీటన్నిటికి చాలా ఖర్చులు అవుతూనేవుంటాయి. దావా వేసింది మొదలు చివరదాకా చాలాఖర్చులు అవుతూనే వుంటాయి. ఇంకొక దురభిప్రాయం ఏమిటంటే కోర్టుకు వెళ్లినవాళ్ళు కేవలం డబ్బుగలవాళ్ళనికాని వాస్తవంలో, ధనవంతులు, బలవంతులకంటె దరిద్రులే ఎక్కువగా court కు వెళ్ళతారు ధనవంతుడు వాదిగా దావావేస్తే గెలిస్తే పేదవాడయినటువంటి వానిదగ్గరనుంచి ఖర్చులతో రాబట్టుకుంటాడు. పేదవాడు దానిపై appeal చేసుకోడాని కవసరమైన court fees చెల్లించుకునే సమర్థతలేక చిక్కులు పడుతూ ఉంటాడు. High Court కు వెళ్ళేలోపల: వాది, ప్రతివాదులిద్దరూ court fees చెల్లిస్తూనే వుంటారు. కాబట్టి యిలాంటివిషయం గ్రహించవలసివున్నది. 1870 లో ఉన్న assessment ను బట్టి net profits ను బట్టి, యింకా కొన్ని విషయాలనుబట్టి ఇదివరకే court fees నిర్ణయించారు. కాని ఈనాడు ఆస్తులవిలువ చాలా విపరీతముగా హెచ్చింది అన్నారు. ధరలతోపాటు జీవితప్రమాణంకూడా హెచ్చిపోయింది అన్నవిషయంమాత్రం మరచిపోతున్నారు. Market value of the properties మీద court fees నిర్ణయముచేయడానికి చాలా కిష్టమైనవిషయం. ఇప్పుడున్న law ప్రకారం మన స్థలంలో యింకొకరు దౌర్జన్యముగా ప్రవేశిస్తే house site అనుకోండి. పొలంఅనుకోండి, ఏదయినా అతన్ని తొలగించడానికి కోర్టుకువెళ్లడంతప్ప వేరే మార్గాలులేవు. వెంటనే court కు వెళ్లితే 10 వేల మీద 75 percent market value కట్టినట్లయితే ఎంతవుతుందో ఊహించుకోండి. మామూలు case లలోకంటె యిలాంటి case లలో వానిదగ్గర డబ్బుండదు. Court వారు dceree యిచ్చినట్లయితే ప్రతివాదిదగ్గర డబ్బుండదు. వాది నష్టపడుతున్నాడు ఇలాంటివిషయాలు ఆలోచించుకునే మామూలు వకాల్తనామాకు అర్ధరూపాయ ఇదివరలో నిర్ణయించారు. కాని యిప్పుడు రెండురూపాయలు చేశారు pettition పెడితే యింకా హెచ్చిస్తున్నారు. శివాయిజమాదార్లు land encroachment appeals చాలావేస్తున్నారు. నా constituency లో ఊరికే పనిచేసినా, వకాల్తా రెండురూపాయలు, petition రెండురూపాయలు, నేను 280 appeals Revenue Boards కు పంపాను. వాళ్లు చాలా పేదవాళ్ళు, నా constituency వాళ్ళు 280 appeals ఒకేసారి Revenue Board కు పంపితే యిందాక చెప్పిన ఖర్చులుకాక type ఖర్చులు వగైరాలు ఎంతో అవుతుంది. Attachment of the property జరిగితే property claim

petition లో వారికి సంబంధంలేక యితరత్రా అన్యాక్రాంతం చేసిన భూమిని ప్రతివాదిని decree-holder జప్తుచేసినట్లయితే తప్పించుకోవాలంటే attachment raise చేయవలసినదని దావా దాఖలుచేస్తున్నట్లయితే market value మీద court fees కట్టి దావాచేయడం అనేది ఒక మార్గం. రెండోమార్గం, summary petition పెట్టాలి. దానిని claim petition అంటారు. Order 21 Rule 63 (a) Civil Procedure Code ప్రకారం, దానిమీద 3 వేల రూపాయల లోపల వున్నట్లయితే 15 రూపాయలు రుసుము ఉంటుంది. Sub-court కు గాని, District court కు గాని jurisdiction వుంటే fees వందరూపాయలు ఉంటుంది. అలాంటిదిలేకుండా market value మీద రుసుమువేయడం రెండోమార్గం. వెనుకటి court fees చట్టంలో రెండువిధాలున్నాయి. ఏదివీలయితే అది సావకాశంచేసుకోడానికి వీలువుండేది.

Writ petition అనేది చాలా ముఖ్యమైనది. రాజ్యాంగచట్టంలో ప్రాథమిక హక్కుల రక్షణకోసం యీ writ petition పెట్టారు. అప్పుడు కొన్నివేల writs వున్నాయనే prejudicial view తో చాలామందికి writs పై వ్యతిరేకాభిప్రాయం ఏర్పడింది. అది సరైన అభిప్రాయంకాదని మనవిచేస్తున్నాను. కొత్తగా రాజ్యాంగం రావడం, ఆ రాజ్యాంగంలో యిలాంటి writ prerogative హక్కువుండడంవల్ల హెచ్చు writ petitions రావచ్చు. వేలాదివేలు writ petitions pending లో వున్నాయి. క్రమేణా writs తగ్గిపోతవని నేను చెబుతున్నాను. ఒక writ petition మీద తీర్పుయిచ్చేసరికి అదే రకమైన ధరఖాస్తులమీద వెంటవెంటనే తీర్పులు వస్తాయి. Estates Abolition Act కు Rent Reduction Act కు సంబంధించిన ఒక writ మీద Madras High Court తీర్పుయివ్వగానే వెంటనే next week లోగానే ఒక batch of judges 500 writs పైన order pass చేశారు. ఒక order తో ఒక కలంపోటుతో వేలాది writ లకు disposal యివ్వడం జరిగింది.

ఇటీవలనే Motor Traffic Act క్రింద ఒక తీర్పు ఇచ్చారు. దానిమీద letters patent కు సంబంధించిన appeal చేస్తే ప్రభుత్వము అక్రమముగా ప్రవర్తించినదని రుజువు చేస్తే తప్ప, దానివల్ల చాల విపరీతమైన నష్టముగాని హానికాని చేస్తే తప్ప మామూలు వ్యవహారాలలో improper, irregular అని రుజువు చేసినంత మాత్రాన ప్రభుత్వముయొక్క order ను రద్దు పరచడానికి వీలులేదని చెప్పి తీర్పు వచ్చింది. కనుక అది settle అయింది. ఇంక motor traffic code క్రింద writs వుండవు. అలాగే land encroachment క్రింద, Estates Abolition Act క్రింద, అలాంటివాటిమీద రానురానూ writs అనేవి తగ్గిపోతాయి. Administrative law ఎక్కువైపోతున్నది. Industrial Tribunal Election Tribunal, Estates Abolition Tribunal ఇంకా యీలాంటి Tribunals ఎక్కువగా

వస్తూ వున్నాయి. తర్వాత ప్రభుత్వము మునిసిపాలిటీలలో పలాని encroachments తీసివేయమంటారు. ఫలాన విధంగా దానిని చేయమని orders వస్తూవుంటాయి. అందుకే చెప్పారు వెంకటరావుగారు Question hour లో "మనకు writ అనేది ఒకటి వుంది; అదిలేనట్లయితే 15 రోజులలో చేస్తామని." కాబట్టి పార్టీ వైషమ్యాలతో కూడుకున్న ప్రభుత్వాలలో writ అనేది democracy లో minorities యొక్క హక్కులను సంరక్షించడానికి ఉద్దేశింపబడిన ఒక బ్రహ్మాస్త్రమని చెప్తు తున్నాను. ఎక్కువగా writs వుండడమువల్ల హానికరమనుచున్నాను. Administration ను paralise చేస్తుంది కాబట్టి వీటిని తగ్గించాలని ఒక మిత్రుడు అన్నాడు. Administration ఎన్నటికి paralise కాదు. ఇదివరకు నేను ఇదే House లో ఆలాటి writs వచ్చినప్పుడు క్రిష్ణాజిల్లాలో పలానా విద్యాసాంఘిక పుస్తకము పెట్ట డానికి వీలులేదని ఎవరైనా writ వేసినపుడు వెంటనే ఒక petition పెట్టి అత్య వసరమైన విషయము కాబట్టి ఇది ప్రజాబాహుళ్యానికి సంబంధించినది కాబట్టి విద్యా విషయానికి సంబంధించినది కాబట్టి వెంటనే disposal చేయాలన్నపుడు ప్రజా స్వామ్యములో ప్రజాప్రభుత్వములో హైకోర్టువు judges ఎప్పటికప్పుడు పరిస్థితులను గమనిస్తూ వుండవలెను. కాబట్టి ఆ విషయాలుకూడా వాండ్లకు తెలిసివుండాలి కాబట్టి postpone చేయకుండా దానిని వెంటనే పరిష్కారము చేయవలసిన బాధ్యత ఎంతైనా High court judges మీద వున్నది. Writ కు రెండు రూపాయలే విధించ వలెనని శ్రీ సంజీవరెడ్డిగారికి మనవిచేస్తున్నాను. ఇప్పుడు వందరూపాయలు ఈ రోజు చేసినట్లయితే Executive excesses కు safety volve ఏమీవుండదని నేను మీ అందరికీ మనవి చేస్తున్నాను. పూర్వము ఒక ఉద్యోగి departmental గా dismiss ఐపోతే అతనికి దిక్కులేదు మొక్కులేదు. కాబట్టి యీ స్వతంత్రదేశ ములోవున్న ప్రజాస్వామ్య సిద్ధాంతాలలోవుండే ప్రజలకు మామూలుగా ప్రభుత్వము నుంచిగాని, యితర నిరంకుశమైన ఉద్యోగులనుంచిగాని సంరక్షించుకోవాలంటే writ అనేది వుండితీరాలి. కనుక దానిని తక్కువచేయమని కనీసము సగానికైనా తగ్గించ డానికి చూడవలసిందిగా నేను ప్రత్యేక విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రభుత్వపక్షములో వుండడమువల్ల నేను దీనికి amendment కూడా మామూలుగా యివ్వడానికి వీలులేదు.

**The Hon. Sri N. SANJEEVA REDDY :—**

ఆ clause వచ్చినపుడు మాట్లాడవచ్చును. general discussion లో ప్రతి clause పైన మాట్లాడితే, మరి clause by clause discussion ఎందుకు?

**Sri S. K. V. KRISHNAVATHARAM :—**

ఇంకా యీలాంటివి చాల కష్టమైన విషయాలు యీ బిల్లులోవున్నాయి కాబట్టి మంత్రివర్యులు clauses చర్చకువచ్చినపుడు మాట్లాడవచ్చునన్నారు. అప్పుడు అవసర మైన suggestions చేస్తాము. ఆ suggestions ను ఆమోదించవలసినదని మంత్రి వర్యులవారిని కోరుతూ సెలవుతీసికుంటూవున్నాను.

Sri P. NARASIMHAPPA RAO —

అధ్యక్షా యీ బిల్లును support చేస్తూ నేను మాట్లాడుతున్నాను. ఈ బిల్లులో ఉదహరించిన విషయాలు అన్నికూడా చాలా బాగున్నాయని నేను చెప్పుతున్నాను.

ఈ బిల్లువల్ల సామాన్యప్రజలమీదపడేది ఏమిలేదని చెప్పి మీకందరికీ నే నొక విజ్ఞప్తిచేస్తున్నాను. కారణము ఎందుచేతనంటే ఇప్పుడుఉన్న చిన్న రైతులు కూలి ప్రజానీకంమీద యీ బిల్లుభారం పడదు. ఎంతసేపుపడినా, ఎంతవరకుపడినా పెద్దవాండ్ల మీదనే పడుతుంది. ఎవడో వ్యాపారస్థుడో, పెద్ద భూస్వామో లేక బ్యాంకరో కోర్టుకువెళ్ళవలసివస్తుంది కాని, బీదరైతుకూలీవాండ్లు court కు పోవలసిన అవసర మేముంది. వాండ్లు కోర్టుకు పోనక్కరలేదు. పేదవాండ్లమీద సిస్తులను కొంతవరకు తగ్గించమని కోరడము బాగుంటుంది. ప్రతిపనికికూడా గర్నమెంటును 'మా కాపని కావాలి, పలానా work కావాలి' అని ఒత్తిడిచేసేవాండ్లము మనమే. మన సంజీవ రెడ్డిగారు వున్నారంటే వారెంతసేపు ఖర్చుచేస్తూనే ఉంటారు భగీరథునిలాగా అంతా కాల్వలకు ఖర్చుపెట్టడముతప్ప ఆదాయమునేది ఒక దమ్మిడికూడా తేవడముకన్పించదు. ఆర్థికవ్యవహారము వారి చేతిలోలేదు. కాబట్టి ఎంతసేపైనా ఖర్చే. ఈ విధమైన stamp duty ఒక్కటే వాండ్ల చేతిలోవుంది కాబట్టి దీనిమీదనైనా కొంత డబ్బు వస్తువుంటే మనము సంతోషించవలసియున్నదని నేను మనవిచేస్తున్నాను. ప్రతిదానిని oppose చేస్తూనేవున్నాము. కొంతమంది ఈ బిల్లును కేవలము oppose చేయాలనే oppose చేస్తున్నారేకాని ఇందులో నష్టమున్నదనే దానిని నేను ఎంతమాత్రము ఒప్పుకోను. ఈ బిల్లును నేను పూర్తిగా support చేస్తూ విరమిస్తున్నాను.

Sri T. LAKSHMINARAYANA REDDI :—

అధ్యక్షా, యీ బిల్లును support చేస్తూ మాట్లాడుతున్నాను. ముఖ్యముగా ప్రతిపక్ష సభ్యుడు Subba Rao గారు యీ రోజున మన court fees కు సంబంధించినంతవరకూ ఇది లాభసాటి వ్యాపారముగా వుండకూడదని కోర్టులలో అధికంగా ఖర్చుపెట్టేదానికి అవకాశంవుండకూడదని, ఎంత కోర్టులకు ఖర్చుపెట్టుతున్నామో అంతమాత్రమే ప్రభుత్వమునకు వచ్చేటట్లు చూచుకోవాలని చెప్పారు. ఈనాడు మనకు కోర్టులలో మిగులుతుంది అనుకునేందుకు యింకా యెంతోకాలము మిగులబోదని మనకు అన్ని జిల్లాలలోకూడా judiciary ని separate చేసిననాడు యిపుడు మనకు మిగులుతుంది అనుకునేది యింక మిగులకుండ పోతుందని, నేను అనుకుంటున్నాను. ఇంకొక విషయమేమిటంటే యిప్పటి భూమి విలువలో ¼ వంతువరకు కోర్టుఫీజు పెట్టడం అనేది చాలా అధికమని అంటున్నారు. అది నిజమే కావచ్చును. కాని ఒక సిద్ధాంతము ప్రకారము ఇటుల చేయవలసివచ్చింది. ఈనాడు మన gardens కు houses కు సంబంధించినంతవరకూ పూర్తి value మీదనే మనము కోర్టుఫీజు చెల్లించుతూవచ్చాము. కాని వ్యవసాయభూమికి సంబంధించినంతవరకూ సగానికి వుండాలని ఉన్నది. అది సిద్ధాంతానికి వ్యతిరేకముగా వున్నది కాబట్టి అందులో కొంత తగ్గించడమూ, యిందులోకొంత

తగ్గించడమూ బాగుంటుందనే ఉద్దేశముతోటి ఆస్తి విలువలో $\frac{3}{4}$ వంతుపై కోర్టుఫీజు చెల్లించవలెనని తీర్మానించాము. కాబట్టి అది ఆక్షేపణీయమైన విషయము కాదని చెప్పి నేను అనుకుంటున్నాను. ఇకపోతే వావిలాల గోపాలకృష్ణయ్యగారు మాట్లాడుతూ habeas corpus petition లాంటి ముఖ్యమైనవాటిమీద వందరూపాయలు పెట్టడము బాగుండడము లేదన్నారు.

The Hon. Sri N. SANJEEVA REDDI :—

Habeas corpus petition మీద మనము పెంచలేదు. వారికి తెలియదు. మరచిపోయినట్లున్నారు వారు. ఏదో చదివి ఏదో మాట్లాడారు వారు.

Sri T. LAKSHMINARAYANA REDDI :—

ఆ Clause లో Habeas corpus petition తప్ప మిగతా petitions అని వుంది. ఇది వారికి చెప్పడముకోసము నేను ముఖ్యముగా తెచ్చాను. తర్వాత వారు విచక్షణనుగురించి చెప్పినవాటి విషయమై మన కొండయ్యచౌదరిగారు సరియైన సమాధానము చెప్పారు. అదే నా ఉద్దేశముకూడా. ఇక pauper suits విషయములో pauper అయినపుడు కోర్టుఫీజు చెల్లించనందుకు civil jail కు పంపడం కూడదని వారు చెప్పారు. అది ఎప్పుడూవున్న సిద్ధాంతమే. నిజముగా ఆస్తిఏమిలేకపోయినట్లయితే ఏ మునిసిఫ్‌కూడా ఆయనను jail కు పంపించడానికి చూడడు. కాని బినామీగా ఎక్కడైనా తాను దాచుకున్నట్లు అనుమానమువచ్చినపుడే civil jail కు పంపడము వుంటుంది కాబట్టి కోర్టుకు ఆ discretion ఎప్పుడూ వుంటుంది. అందువల్ల దానిని గురించి ఆందోళనపడవలసిన అవసరమేమీలేదు.

కృష్ణావతారంగారు రాజకీయాల్లోవున్న న్యాయవాదులకు వాస్తవికాలు తెలియవని వారు చాల సీరియస్ allegation చేశారు. కానీ ఆయనకూడా అట్లాంటి రాజకీయాల్లో వున్నవారే అని తెలుసుకొనివుంటే వారు యిట్లా మాట్లాడివుండరనుకుంటాను. ఈ బిల్లులో పెద్ద లోపాలు యేమీలేవు. అందువల్ల దానిని ఆమోదించవలెను అని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

Sri P. GUNNAYYA :—

అధ్యక్షా! గౌరవనీయులు సంజీవరెడ్డిగారు ప్రతిపాదించిన యీ కోర్టు ఫీజు బిల్లును నా హృదయపూర్వకముగా బలపరుస్తున్నాను. భూమికి సంబంధించినంత వరకు court fees ను హెచ్చుచేశారు. దానిలో తప్పు లేదని లాయర్లు చాలామంది చెప్పారు. చాలామంది బీదవాండ్లు, హరిజనులు యిదివరకు వున్నటువంటి ఫీజును కట్టుకొని దావాలకు వెళ్ళలేక వారికిచెందిన భూములలో చాల fees ను ఇంకా రాబట్టుకోలేకున్నారు. ఇప్పుడు ఫీజునుయింకాకొంత యెక్కువచేశారు కాబట్టి తగాయిదాలు గ్రామాలనుండి పైకివెళ్ళేటపుడు ఆవిధంగా వాళ్ళు నాశనంఅవుతారేమోనని నాకు

భయంవేస్తుంది కాబట్టి సామాన్యమైన ప్రజలకు యిది వర్తింపకుండాచేసి యిప్పుడు వున్నటువంటి రేటునే హరిజనులు, బీదవాండ్లు ఇకముందుకూడా చెల్లించే యేర్పాటు ప్రభుత్వమువారు చేస్తారని నేను ఆశిస్తున్నాను. అదిగాక మద్రాసురాష్ట్రములోకూడా భూమిశిస్తుపైని 30 రెట్లు హెచ్చించి కోర్టుఫీజు నిర్ణయించారు. ప్రక్కనవున్న మదరాసురాష్ట్రంలో యేయేపనులు చేస్తున్నారో మనంకూడా అదేచేస్తాము అని అనేకసార్లు మంత్రి కళావెంకట్రావుగారు సెలవిస్తున్నారు. కాబట్టి మదరాసురాష్ట్రంలో ఈ కోర్టుఫీజు ఏవిధంగా ఉన్నదో అదేవిధంగా మన ఆంధ్రరాష్ట్రంలోకూడా చెయ్యడం చాలా అవసరం అని నేను భావిస్తున్నాను. అటుపైని ప్రభుత్వంవారి యిష్టం. తరువాత యీ రిట్టు వేసుకోవడానికి డబ్బువున్నవారు గుంటూరువచ్చి రిట్టు వేసుకోవచ్చు. లేకుంటే యింకోదగ్గరఅయినా రిట్టువేసుకోవచ్చు. ఇదివరకు రిట్టు చార్జీలు పాతిక రూపాయలువుంటే యిప్పుడు 100 రూపాయవరకు హెచ్చించినట్లు బిల్లులోవుందని నేను అనుకొంటున్నాను. పాతికరూపాయలిచ్చి రిట్టువేసుకోలేక చాలామంది యిబ్బందిపడ్డారు. పెద్దపంచ అనేగ్రామంలోనివాళ్ళు, ఆస్తి పోతుందని తెల్పినా గుంటూరు High Court లో పాతికరూపాయలిచ్చి రిట్టు వేయడానికి రాలేక యిప్పటిదాకా రిట్టువేయలేదు. ప్లీడర్లకెక్కడనుంచి యిస్తారు? తరువాత వీళ్ల ఖర్చు లెక్కడపెట్టుకుంటారు? 100 రూపాయలు ఫీజు యెక్కడయిస్తారు? కాబట్టి హరిజనులు మొదలైన బీదవాండ్లు రిట్టువేసేటప్పుడైనా, యిప్పుడు కనీసం పాతికరూపాయలరేటునే ప్రభుత్వంవారు నిర్ణయించవలెనని నేను ప్రభుత్వంవారికి మనవిచేస్తున్నాను. కనీసం హరిజనులకయినా కోర్టుకువెళ్ళేటప్పుడు అన్నిటిలోను ప్రిఫరెన్సు యిస్తున్నారు. కాబట్టి వీటిలోకూడా హరిజనులకు కొంత ప్రిఫరెన్సు యిప్పించే యేర్పాటు ప్రభుత్వంవారు చేస్తారని ఆశిస్తున్నాను.

మా పార్వతీపురండివిజన్‌లో కోర్టు ఏర్పాటుచేయమని ప్రభుత్వంవారికి అనేక పర్యాయములు మనవిచేస్తున్నాము. ఒక సబ్‌కోర్టును ఆ పార్వతీపురం డివిజన్‌లో ఏర్పాటుచేసి అక్కడి ప్రజలు యిబ్బందులు, ఆ వకీళ్ళ యిబ్బందులు తొలిగిస్తారని ఆశిస్తూ ప్రభుత్వంవారిని వినయపూర్వకముగా ప్రార్థిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri K. V. RAMANAIAH :—

అధ్యక్షా, ఈ బిల్లులో కోర్టుఫీజుక్రింద చెల్లించవలసిన మొత్తాలను చాల యెక్కువగా పెంచారు. మన స్టేటుకు ఎక్కువ ఆదాయము రావలయుననన్న వుద్దేశంతో ఆ విధంగాచేశారు, Administration of Justice అనేది అందు కోసం కాదు. Justice అనేది లాభసాటి పద్ధతిమీద గలుగజేయడం అనేది చాలాతప్పు. చవుకగా త్వరగా ప్రజలకు న్యాయం కలిగేటట్లు చెయ్యవలసిన బాధ్యత ప్రభుత్వంమీదవున్నది. అదేపద్ధతిచెయ్యాలని చెప్పి శాస్త్రవేత్తలంతా వొప్పుకొన్న విషయం. మనకు కోర్టుస్ ఫీజు మీద వచ్చేటటువంటి, ఆదాయం కోర్టుల నిమిత్తం ఖర్చుపడే మొత్తంకంటే చాలా

యెక్కువ. ఇంగాక కొండయ్యచౌదరిగారు మేజిస్ట్రేటుకోర్టులలో కుర్చీలు కాళ్లు విరిగి పోయినవి. వెనుక బెంచీలులేనివి ఉన్నవని అన్నారు. కోర్టులద్వారా యెక్కువ ఆదాయం వస్తున్నప్పటికీకూడా గవర్నమెంటువారు అటువంటి సదుపాయాలు, సౌకర్యాలు యేమీచేయడంలేదనేది కోర్టులలోవుండే న్యాయవాదులకు తెలిసినవిషయమే. దానికి కారణం గవర్నమెంటువారిని చెప్పను. అక్కడవున్నటువంటి కలెక్టర్లుగానీ, సబ్‌డివిజనల్ మేజిస్ట్రేట్లుగానీ, మాజిస్ట్రేట్లుగానీ సరిఅయిన విధముగా సరిఅయిన time లో రాష్ట్రప్రభుత్వానికి సరిఅయినటువంటి representation చెయ్యకపోవడం వల్ల అటువంటిపరిస్థితులు జరుగుతున్నాయి. ఏదోవిధంగా రాష్ట్రానికి ఆదాయం సంపాదించడాన్ని ముఖ్యవుద్దేశముగా పెట్టుకొన్న యీబిల్లును శాసనసభలో ప్రవేశపెట్టేదానికి select committee కి పంపించారు. Composite state లో వుండగా కోర్టుఫీజు విషయములో revision చేయదలచినప్పుడు ప్రభుత్వ అభిప్రాయాన్ని ప్రజలకందరికీ వెల్లడిచేసి, కోర్టులకు, జడ్జీలకు రాష్ట్రంలో వున్నటువంటి Bar Associations వారందరికి పంపించి, వారియొక్క ఉద్దేశాలను తెలుసుకొన్నతర్వాతనే మార్పులు చేశారు. ఇప్పుడు అటువంటిదేమీ చెయ్యకుండా, High Court కు పంపకుండా, జిల్లాజడ్జీలకు, సబ్‌జడ్జీలకు పంపించకుండా Bar Associations కు పంపించకుండా కేవలం మొదటిసారే శాసనసభలో పెట్టి అది సెలెక్టుకమిటీకి పంపించి ఆ సెలెక్టుకమిటీని వేదికను యిప్పుడు చర్చకు తీసుకొనివచ్చారు. ఈ సెలెక్టుకమిటీలో చాలామంది న్యాయవాదులున్నారు. అంతా న్యాయవాదులేనని అనుకొంటున్నాను. అందులో కొందరు చాలా అనుభవంకల్గినవారున్నారు. వారంతా చర్చించి కొన్ని విషయాల్లో చేసిన సవరణలను మనం ఆమోదించవలసివున్నది. అయితే ముఖ్యంగా నాలుగువిషయాలలో యేర్పాటు చేసినటువంటి యెక్కువ కోర్టుఫీజు న్యాయంకాదు అంటున్నాను.

మొట్టమొదటిది injuction suits విషయం ఇల్లుగాని, పొలంగానీవుంటే, యెవరైనా దారేపోయేవాడు అందులో కూర్చుంటే వాడిదే హక్కు అనేటటువంటి ఒక విపరీతమైన వాదం. దేశంలో ప్రజల్లో బయల్దేరింది కాబట్టి, ప్రతివాడు నేను భూమి మీదనే కూర్చుంటాను. కదలను. ఇంజక్షన్ సూటువేసుకోమంటే దానికి సగం మార్కెటువాల్యూమీద court fees పెట్టమంటే అంతకన్నా అన్యాయం మరొకటి లేదు. ఇదివరకు యేవిధముగా ఫీజుయిచ్చారో అదేవిధంగా వుండాలిగానీ వారెవరో వచ్చి బెదిరించి నంతమాత్రాన ఎక్కువ కోర్టు ఫీజు పెట్టి దావావేసుకోమంటే యింతకంటే ప్రజలకు చేసే అన్యాయం యింకేమీ వుండదు. అదేవిధముగా declaratory suits ఉన్నాయి. ఎవరోవచ్చి ఒక విధమైన పేచీపెట్టితే హక్కును స్థిరపరచడానికి టైటిల్ వుందని కోర్టుకువెళ్ళితే దాంట్లోకూడా యీ ½ విలువమీద కోర్టుఫీజు స్టాంపు పెట్టవలసిఉన్నది. తరువాత claim suits విషయం గమనించవలసి ఉన్నది. ఒక వ్యక్తి ఆస్తిని అన్యాయముగా జప్తుపెడితే, ఆ భూమిని కొనుక్కొన్న ఆసామి ఈ ఆస్తి నాదే, నేను కొనుక్కొన్నాను. నా స్వాధీనంలోవుంది. శిస్తులు చెల్లిస్తున్నాను.

ఈ ఆస్తిని జప్తు చేయకూడదని చెప్పి,కనుక claim suit వేసినప్పుడుకూడా ఆ స్తివిలువలో $3/4$ వ వంతుపై court fees చెల్లించాలనడం న్యాయంకాదు. ఇంత కోర్టుఫీజు పెట్టిన తర్వాత అవతల వాడిదగ్గరనుంచి రాబట్టుకొనేది దమ్మిడీ వుండదు. కాబట్టి ఈ 3 విషయాలలోకూడా యిప్పుడున్నటువంటి court fees ను యెక్కువచేయడం చాలా తప్పు. ఈ డిక్లరేటరి సూట్సులోగానీ, యింజెక్షన్ సూట్సులోగాని, యీ క్లెయిం సూట్సులోగానీ, half the value మీదగానీ, మూడువంతుల ఆస్తిమీదగాని court fees వసూలు చేయడం చాలా అన్యాయం. ఆస్తివున్న వాడిని బాధపెట్టడానికీ, ఆస్తి లేనివాడు చేసే ప్రయత్నాలకు ఈ పద్ధతి చాలా ప్రోత్సాహకరంగా వుంటుంది కాబట్టి ఇది చెయ్యడం అనేది సబబు కాదు.

ఇదివరకు ఏదైనా స్థిరాస్థి రాబట్టుకోవాలన్నా, స్థిరాస్థిమీద ఫలసాయము రాబట్టుకోవాలన్నా, ఈ స్థిరాస్థిమీద మొట్టమొదట చెల్లించే పన్నును ఆధారంగా తీసుకొని stamp duty పెడుతూఉండేవారు. అయితే ఈ మధ్య సగమువంతు ఖరీదు పెట్టమన్నారు. ఆ సగమువంతును యిప్పుడు $\frac{3}{4}$ వంతు చేశారు. కొండయ్యచౌదరి గారు ఆస్తి అసలు ఖరీదు పెట్టవలసింది. అన్నారు. ఈ $\frac{3}{4}$ వంతు అనేది మధ్యస్తంగా యెందుకువచ్చిందో నాకు అర్ధముకావడములేదు. పూర్తిగా ఉంచితేనే సరిపోయేది. ఇప్పుడు దేశంఅంతటాకూడా సమత్వము ఉండాలంటున్నారు, సమత్వమంటే లేని వాడిని పైకితీసుకువెళ్ళి ఆస్థాయికి ధనవంతులను దించడం వంటిది కాదు. ఒకే స్థితిలో pull down చేయడంతప్ప push up చేయడం యెక్కడా సాధ్యముకాకుండా వున్నది కాబట్టి $\frac{3}{4}$ వంతు పెట్టాలన్నారు, దాంట్లో ఎటువంటి principal లేదని నా ఉద్దేశ్యము. ఇప్పుడు $\frac{3}{4}$ ఎందుకు పెట్టాలి? ఉన్నదాన్ని యెందుకు పెంచవలసి వచ్చింది? కేవలం State కు ఆదాయం సమకూర్చాలనే ఉద్దేశం మన administaation of justice అనేదానిని commercial subject క్రింద deal చేయడం అనేది న్యాయశాస్త్ర సూత్రాలకు వ్యతిరేకము. ఈ $\frac{3}{4}$ వంతు చేయడం అనేది తప్పు Injuction suits, declaration suits, claim suits కు $\frac{3}{4}$ వంతు పెట్టడం అనేది చాలా తప్పు.

Writ petitions అనేవి ఉన్నాయి. మనకు కొత్తగా స్వాతంత్ర్యమువచ్చిన తరువాత, కొత్త Constitution వచ్చినతరువాత, ప్రతి హైకోర్టులోను ఎన్నో writ petitions వస్తున్నాయి. కోర్టువారికి వీటితో కాలమంతా వృథాఅవుతున్నది. Writ petition కు ఇదివరకు 2 రూపాయలు ఉంటే, దానిని 25 రూపాయలు చేశారు. ఇప్పుడు దానిని 100 రూపాయలు ఎందుకు చేయకూడదని శేషావతారంగారు అన్నారు. దాని ఖరీదు తక్కువగా ఉన్నదని ప్రతి వాడు writ ధరఖాస్తు పెడు తున్నాడు. కాబట్టి 100 రూపాయలు చేయడము సబబు అని నా ఉద్దేశ్యము. High Court నుంచి తీర్పు తెచ్చుకోవడము చాలా చౌకగా ఉన్నది. కాబట్టి యిప్పుడు

100 రూపాయలు పెడితే తప్ప లేకపోతే Administration paralise అయిపోతుంది. Administration యొక్క నడకకే ఆటంకం వస్తుంది. ఇన్నీ కూడా అపుదల చేయాలంటే నిజముగా grivance వుంటే writ దరఖాస్తు చేయవచ్చు. వీటివల్ల లాయర్సుకుకూడా వేలకువేలలు ఆదాయం వస్తున్నది. అంత ఫీజు కట్టుకొన్నవారు Government కు కూడా కొంత యిచ్చినట్లయితే ఆదాయం వస్తుంది. రు 100 లు పెట్టినట్లయితే జాగ్రత్తగా ఆలోచించే రిట్ వేస్తారు. ప్రతి రు. 1కి రిట్ అంటూ పరుగెత్తకూడదు. అందువల్ల ఈ 100 రూపాయలకు అంగీకరించమని సభ్యులనందరను కోరుచున్నాను. మన సోదరులు ఇద్దరు, సెలక్టుకమిటీ సభ్యులు decenting note వ్రాశారు. అది మనం అందరము ఒప్పుకోదగ్గ అభిప్రాయము మీద వ్రాసిన decent కాని వేరే ఉద్దేశ్యంతో వ్రాసినది కాదు. దానిని నేను చదివాను. దీనిని గురించి సుబ్బారావుగారుకూడా మాట్లాడారు. మన Judicial Department లో న్యాయము, స్వతంత్రము యెక్కువగా ఉన్నది. దీనినిగురించి మనం అందరమూ గర్వించవలసిన విషయమే. దీనిని డబ్బు ఆర్జన department క్రింద పెట్టడము పొరపాటు. ఇక్కడ ఇంకా ఎక్కువ సదుపాయాలు చేయవలసి వున్నది. చాలాచోట్ల Bar Associacions కు buildings లేవు. వీటిని కట్టించవలసివున్నది. ఇప్పుడువచ్చిన డబ్బు కాకుండా ఇంకా ఎక్కువ ఆదాయం వస్తుందికూడా. Bar Association కు కావలసిన సౌకర్యాలు చేయాలని చెబుతున్నాను. ఉప ముఖ్యమంత్రిగారు దీనిని consider చేసి ఉన్న status ను maintain చేసి మిగతా విషయాలు కనుకచూచినట్లయితే చాలా బాగుంటుంది. separation of judiciary from executive విధానం అమలు జరిపినందువల్ల cost ఎక్కువఅయింది అన్నారు. ఇప్పుడు క్రొత్తగా చేయబోయేటటువంటిది cost ఎక్కువ కావడానికి వీలులేకుండా తక్కువ చేయడానికి వీలున్నది. ఈ విధంగా పన్ను ఎక్కువ చేయడము అనేది సబబు కాదు. Claim suits, declaration suits, injuction suits ఈ విషయములో ఇప్పుడున్న rates ను ఉన్నవిధముగానే అట్టిపెట్టి, మిగతా విషయములలో సెలెక్టుకమిటీవారు చేసిన మార్పులను అంగీకరిస్తూ అంతవరకు ఈ బిల్లును support చేయడం ఉద్దేశ్యంతోనే ఈ బిల్లును అంగీకరిస్తు నేను మాట్లాడినాను.

Sri N. SREENIVASA RAO :—

అధ్యక్షా, ఈ కోర్టుఫీజు బిల్లును నేను హృదయపూర్వకముగా బలపరుస్తున్నాను. కాని మన గున్నయ్యగారు చెప్పినట్లు ఏవోకొన్ని general considerations చేయవలసిందని చెప్పి నేనుకూడా మనవి చేస్తున్నాను. ఇతరులు కొన్నిచోట్ల హరిజనులకు encrochment చేసినటువంటి భూముల సందర్భములో అవి 10, 11 సంవత్సరాలుగా ప్రభుత్వముదగ్గర pending లో ఉన్నప్పుడు డబ్బు ఉన్నవారలే కోర్టుకు వెళ్ళడం, డబ్బులేనివారుకూడా కోర్టుకు వెళ్ళుటకు సావకాశములు ఉన్నప్పటికికూడా కోర్టుఫీజు ఇచ్చుకోవడానికి, లాయర్లకు డబ్బు యిచ్చుకోవడానికి సావకాశములేని వారి

స్థితిలో లక్షలాది రూపాయలు విలువగలిగినటువంటి ఆస్తులను కోల్పోయినటువంటి హృదయవిదారకరమైనటువంటి సంఘటనలు మన ఆంధ్రరాష్ట్రములో మన ప్రభుత్వం జరుపుతున్నప్పుడుకూడా, ఎన్నో జరిగాయని ఉప ముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకు వస్తున్నాను. హరిజనులు అనేవారు ఈ కోర్టుఫీజులను కట్టలేని కారణముచేత ఇటువంటి సంఘటనలు జరుగుతున్నాయి. అయితే హరిజనుల సాంఘికవిషయాలకు సంబంధించిన వ్యవహారములలో మాత్రము తక్కువగా కోర్టులకు రాకుండానే ప్రతిగ్రామములోని హరిజన పెద్దలు చదువుకట్నం అని ఒక రూపాయి తీసుకొని సాంఘిక న్యాయానికి సంబంధించిన వ్యవహారాలు చూస్తూ ఉంటారు. అసలు కోర్టుకువచ్చే విషయం తక్కువ, ఇటువంటి సందర్భములో కోర్టుఫీజులు యెక్కువచేసి వాటికి exemption కనుక లేకపోయినట్లయితే హరిజనులు చాలా బాధపడాల్సివస్తుందని మనవిచేస్తున్నాను. ఇటీవల నెల్లూరు తాలూకాలోని భూముల విషయము ప్రభుత్వానికి అనేక పర్యాయములు విజ్ఞాపనలు చేసుకున్నా కొంతమంది శాసనసభ్యులు అక్కడకువెళ్ళి ఈ తగాదాలోని విషయాలను గురించి పరిశీలనచేసి ముఖ్యమంత్రిగారికి వాటిని తెలియజేసినాము.

జరుగుమల్లిలోన జరిగిన కథనంత,
శ్రద్ధగాను మేము సేకరించి,
ముఖ్యమంత్రికియ్య, మూతివిరచెనుగాని,
న్యాయమేమో చేయడాయె. దేవా !

అని ఆ హరిజనులు కోర్టుకు పోవడం జరిగింది. ఈ తగాదాలో న్యాయమేమో తేల్చకుండా రివిన్యూబోర్డు చెప్పిన తీర్పుకు విరుద్ధముగా ఆర్డరులు పంపడంజరిగింది. జరిగినటువంటి విషయం పత్రికలో ప్రకటించడము జరిగింది. దానిని చాలామంది మిత్రులు చూచివుంటారనే నేను ఆశిస్తున్నాను.

ఒకప్రక్క Socialitic Pattern of Society ని నిర్మాణముచేయడానికి ప్రయత్నంచేస్తూ పేదవారు న్యాయాన్ని అర్థిస్తూ న్యాయస్థానాలకు పోవుటకు వలను పడనటువంటి పద్ధతిలో కోర్టుఫీజు బిల్లును తయారుచేయడం జరిగిందని మనవిచేస్తున్నాను.

అయితే ఈవేళ ప్రభుత్వము ఆదాయాన్ని గురించి అనేక మార్గాలు ఆలోచించి, ప్రభుత్వముయొక్క ఆదాయాన్ని పెంపుదలచేయడములో నా అభ్యంతరములేదు. ఈవేళ ప్రజానీకములో ఎక్కువమంది మాకు యెక్కువ సదుపాయాలు కావాలని చెప్పేవారే తప్ప, ఎక్కువ పన్నులు వేయండి అని వాలంటరీగా చెప్పేవారులేరు. అందులోకూడా కాస్త పన్నువేస్తే ఎక్కువ కాకిగోల చేసేవారు అనేకమంది వున్నారు. ఇటువంటిపరిస్థితులలో కనీసం Justice కు సంబంధించినటువంటి విషయ

ములోనైనా, వాళ్ళయొక్క పరిస్థితి చూడండి. ఈవేళ ఆంధ్రదేశములో ఉండేటటువంటి economic status ఏమిటి, ఎంతవరకు వాళ్ళకు ఆర్థికముగా రాబడియున్నది. ఏపరిస్థితిలో వారికి న్యాయం కలుగుతుంది. అనేటటువంటి విషయాన్నికూడ మీరు ఆలోచించాలి. అట్లాగే, అస్పృశ్యతానివారణ బిల్లు గురించి, అది అమలుజరగడంలో ఎక్కడైనా లోపాలు ఉన్నప్పుడు, కోర్టుఫీ అక్కరలేకుండా హరిజనులకు free గా lawers పనిచేయాలనేటటువంటి విషయమునకుగాను బిల్లులో పెట్టారు. కనుక ఎక్కడయినా అటువంటి కేసులు పెట్టడంగాని, lawyers రావడంగాని అటువంటిదేమి జరగడంలేదు. ఇంకా చట్టవిరుద్ధముగా, అనేకచోట్ల Public బావులదగ్గరగాని కాఫీ హోటళ్ళలోగాని హరిజనులకు ప్రవేశములేకుండాఉండే సందర్భాలు ఉన్నాయి. అటువంటివి ఎక్కడెక్కడ ఉన్నాయో, ఆ భోగట్టాకూడా కావాలంటె ఇవ్వగలను. కనుక దానిక్రింద ఎన్ని కేసులు పెట్టారు. ఎన్ని కేసులలో హరిజనులకు లాయర్లను యిచ్చి ఫ్రీగా చేశారు అనేటటువంటిది చూస్తే, అది ఏమంత ప్రోత్సాహకరంగాలేదు. అందుచేత ఈ రిట్ పిటిషన్ను విషయంలో ధనవంతుల ఆస్థులలో బీదవాళ్ళు వచ్చి కూర్చుంటారు. అందువల్ల వాళ్ళు కోర్టుకు వెళ్ళవలసివస్తుంది. అని రమణయ్యగారు చెప్పారు. నిజమే హెచ్చుచోట్ల అట్లా జరిగితే జరిగివుండవచ్చును. కాని పేదవాళ్ళ విషయంలోకూడా కోర్టుకు వెళ్ళవలసివస్తే వాళ్ళు ఎట్లాగూ కోర్టుకు వెళ్ళలేరు కాబట్టి మనము local గా వుండే officers ను influnce చేసుకొని, మన హోదాలను పురస్కరించుకొని వాళ్ళను అథోగతిపాలు ద్రొక్కాలనిఅనుకొన్నవాళ్లు కోర్టుకువెళ్ళే విషయములో ఏమిచేయాలో రమణయ్యగారు దానికి alternative suggestion ఇస్తే నేను వారిని అభినందిస్తాను. కనుక నేను మనవిచేసేది, మీరు ఏ ప్రాతిపదికపైన అయితే విద్యకోసము, విజ్ఞానముకోసము, నీటికోసము concessions ఈ previleges హరిజన community కి ఇస్తున్నారో, ఆ విధంగానే ఇక్కడకూడ వారికి కొంత concession అవసరము, యుగయుగాలనుంచి, తరతరాలనుంచి ఒక organized form గా, depressed class గా ఉంటున్నటువంటి మాకు ఇచ్చినటువంటి privileges కూడ చాలా తక్కువగా ఉన్నాయి, ఆ claim కూడ పది సంవత్సరములలో పోతుందేమో తెలియదు. అందుచేత సాంఘికన్యాయమైన justice జరగడానికికూడ కనీసం ఉచితమైనటువంటి సేవ ప్రభుత్వము మాకు చేస్తుందని, ఉపముఖ్యమంత్రిగారు ఈ విషయము ఆలోచిస్తారని నేను మనవిచేస్తున్నాను. తక్కిన విషయాలన్నింటిని detail గా చెప్పడానికి నేను lawer ను గాను. భూములువున్నవాడిని కాను. ఎక్కువసార్లు కోర్టుకు వెళ్ళినవాడినికూడ కాను. రాజకీయంగాతప్ప, అందుచేత ఈహరిజనులకు సంబంధించినంత వరకు ఈ సూచనతో అందరు సభ్యులు అంగీకరిస్తారని అందులో ముఖ్యముగా కమ్యూనిస్టుమిత్రులు దీన్ని బలపరుస్తారని అభిప్రాయపడుతున్నాను. ప్రభుత్వము ఆలోచించి అట్లాంటి న్యాయాన్ని కలుగజేయవలెనని ప్రార్థిస్తూ ఈ బిల్లును బలపరుస్తూ ఇంతటితో విరముస్తున్నాను.

SRI PRAGADA KOTAIAH

అధ్యక్షా,

ఈ బిల్లు ఏమైనా అర్థమవుతుందేమోనని చదవడం ప్రారంభించాను కాని నాకు అర్థంకాలేదు. అయినా నాలుగుమాటలు నాకు తోచినవరకు చెప్పాలని అనుకొంటున్నాను. ముఖ్యంగా రాష్ట్రములో డబ్బు ఖర్చుపెట్టడంఅనేది వచ్చేటప్పటికి మంచి వాళ్లకోసం ప్రభుత్వము అట్టే ఖర్చుపెట్టవలసిన అవసరంలేదు. చెడ్డవాళ్లకోసమే ఎక్కువగా ఖర్చుపెట్టవలసియుంటుంది. దానికి మార్గాలు అన్వేషించవలసివస్తుంది. అప్పుడు మంచి వాళ్లకు కొంచము కష్టము సంభవిస్తూఉంటుంది. ఎందుకంటే? ఇప్పుడు పెద్ద పెద్ద వైద్యాలయాలు నిర్మిస్తున్నారు అనుకోండి. వాటికి కోట్లకొలది డబ్బు ఖర్చుపెట్టాలి. ఇందులో ఆరోగ్యవిషయములో జాగ్రత్త తీసుకోని ఫలితంగానో లేక ఇతర కారణాలవల్లనో అనారోగ్యము తెచ్చుకొన్నవారికొరకు ఇతర మంచివారి డబ్బుఅంతా ఖర్చుపెట్టుతున్నాము. అలాగే పోలీసువారి వ్యవహారం విషయంలోను, courts కు సంబంధించిన విషయంలోను ఉంటుంది. సాధ్యమైనంతవరకు మనము లాభదృష్టితో కాకుండా, క్షేమదృష్టితోటి ఆలోచించాలి అనేది ఉన్నాగాని క్రమక్రమంగా litigation ను పెంచేదానికి మనం ప్రోత్సాహం ఇవ్వకూడదేమో అనే అభిప్రాయము నాకు కలుగుతున్నది. ముఖ్యంగా ఇప్పుడు Civil Courts కు వెళ్లేటటువంటివారు విశేషంగా ధనవంతులుగానే ఉంటారు. పెద్ద పెద్ద ఆస్థులకు సంబంధించినవారే litigations లో పడుతూఉంటారు. గాని అర ఎకరా, లేదా ఎకరా ఉన్నటువంటి చిన్న చిన్న వారు చిన్న చిన్న పేచీలువస్తే గ్రామంలో పంచాయితీలద్వారానే సర్దుబాటుచేసుకొనేటటువంటి అవకాశమున్నది. అందుచేత fees ఏదైన పెంచినప్పుడు, బహుశా గ్రామ పంచాయితీ విధానాన్ని మనము పరోక్షంగా పెంచినట్లు అవుతుందేమో అనుకొంటాను. తప్పనిసరిగా ఈ భూస్వాములు అని చెప్పండి, లేదా వ్యాపారస్థులని చెప్పండి. వీరు ఇంకా ఇతర విధాలా litigations ఉన్నవారు కోర్టులకు వెళ్లే విషయములో, సాధ్యమైనంతవరకు వారి దగ్గరనుండి హెచ్చుగా డబ్బు రాబట్టడంలో మనము అట్టే అభ్యంతరంపెట్టవలసిన అవసరములేదేమో అనుకొంటాను. కాని మన మిత్రులు ఇది బీదవాళ్లకు సంబంధించినది, పేదవాళ్లకు కష్టముకలుగుతుంది అని అంటున్నారు. కాని ఏకోర్టుకైనవెళ్ళి, అక్కడ ఉన్నటువంటి దావాలను జాగ్రత్తగా పరిశీలించి చూచినట్లయితే, పేదవారు ఎంత మంది ఉన్నారో, లేకపోతే ధనవంతులు ఎంతమంది వున్నారో, తెలుస్తుంది ఈవేళ మన కమ్యూనిష్టు మిత్రులు చేసేవాదన పేదవాళ్ళకోసమా, ధనవంతుల కోసమా అనేది చాలా స్పష్టంగా బోధపడుతుంది. అందువల్ల దీనికి రమణయ్య

నాయుడుగారిని అడగవలసిన అవసరములేదు. మీరు ప్రత్యక్షంగా చూడవచ్చు. ఈ వేళ మీరు గుంటూరులోగాని, విజయవాడలోగాని, జగ్గయ్యపేటలోగాని అక్కడవున్న కోర్టులుతీసుకొని, అందులో ఉన్నటువంటి దావాలలో ఆస్థులువున్న వారు ఉన్నారా లేక ఆస్థులు లేనివారు ఉన్నారా అనేది జాగ్రత్తగా పరిశీలించినట్లయితే, ఆస్థులు ఉన్నవారే కోర్టుకు వెళ్లుతున్నారుతప్ప లేనివారు వెళ్ళడంలేదు అని మీకు ప్రత్యక్షంగా తెలుస్తుంది. కనుక మీరు ఈవిధంగా పేదవాళ్ళ పేరుచెప్పి పెద్దలకే ప్రయోజనం కట్టబెట్టేదానికి ప్రచారం సాగిస్తున్నారుతప్ప అంతకంటె అదనంగా ఏమి చేయడం లేదని నేను మనవిచేస్తున్నాను. ముఖ్యంగా ఆ దృష్టితోటి నేను చెప్పాలనుకొన్నాను. ఈ చట్టములో ఉన్నవన్నీకూడా అనుసరించడంలో అనగా ఆనాటి ఆచరణలో ఎలాంటి సాధకబాధకాలువస్తాయో నాకు తెలియదు. కాని State ఎప్పుడుకూడా మంచివాళ్లదగ్గరనుండే డబ్బుతీసుకొని చెడ్డవాళ్లకొరకు ఖర్చుపెట్టేటటువంటి పరిస్థితిలో ఉన్నది కాబట్టి సాధ్యమైనంతవరకు పేదవాళ్ళకు ప్రయోజనం కలిగించేవికూడ ఆలోచించాలి. మన మిత్రుడు హరిజనులనుగురించి చెప్పాడు. మనము ప్రతేకంగా హరిజనులు అనేటటువంటి దృష్టికంటె, అగ్రకులాలకుచెందినా, లేక హరిజనులకుచెందినా, లేక ఏకులాలకుచెందినా పేదవాళ్లు అందరు ఒక్కటే అనే దృష్టిని అలవర్చుకోవలసిందనీ మన మిత్రుడు శ్రీనివాసరావు గారికి నేను చెప్పుచున్నాను. ఆదృష్టిని అలవర్చుకొన్నప్పుడే మనము దేశములో ముందువెళ్ళడానికి అవకాశమున్నదిగాని నేను హరిజనుడను, నేను హరిజనుడను, నాకుమాత్రము ప్రయోజనంకావాలి అనడంలోలేదు. కనుక అటువంటి అభిప్రాయము విడిచిపెట్టి మామూలుగా ఎవరు ఏకులానికి చెందినాసరే, అది బ్రాహ్మణ కులముగాని, రెడ్డికులముగాని, కమ్మకులముగాని, ఏకులమైనాసరే వారు పేదప్రజలు అనుకొన్నప్పుడు యావన్మందికి సమిష్టిగా ఒక మామూలుగా ఒకేరకమైనటువంటి ప్రయోజనాన్ని సాధించుకొన్నప్పుడే పేద ప్రజలు ముందుకువెళ్ళి మామూలుగా హరిజనులకుగాని, గిరిజనులకుగాని ప్రయోజనం జరుగుతుంది. కనుక హరిజనులకు ప్రత్యేకమైన సౌకర్యాలు కావాలనేది ఇప్పటినుంచిదైనా మార్చుకొని మనమంతా కలసికట్టుగా ముందుకువెళ్ళడానికి ప్రయత్నం చేయవలసిందని మన శ్రీనివాసరావు గారికి నేను ప్రతేకంగా విజ్ఞప్తి చేస్తున్నాను. అందువల్ల ఏదైన ప్రయోజనం కలిగించాలి అనుకొన్నప్పుడు ఏ కులానికి చెందినవారైనాసరే పేదవారందరికీ ఒకే రీతిగా ప్రయోజనం కలిగించేదానికి ప్రభుత్వము ప్రయత్నించవలసిందని నేను విజ్ఞప్తి చేస్తూ సెలవుతీసుకొంటున్నాను.

Sri T. VEERARAGHAVULU :-

అధ్యక్షా మహాశయా, ప్రభుత్వమువారు తెచ్చినటువంటి Court Fee సవరణ బిల్లును నేను బలపరుస్తూ ముఖ్యమైన కొన్ని సూచనలు చేయవలెనను తలంపుతో నేను ప్రయత్నం చేస్తున్నాను. మనదేశంలో ఇప్పటివరకు జరుగుతున్నటువంటి న్యాయము ఆలస్యంగా జరుగుతున్నదని, ప్రజానీకానికి అందుబాటులో లేదని ప్రజానీకము ఈ న్యాయసిద్ధికోసం పడవలసిన ప్రయాసాలు చాలా హెచ్చుగా ఉన్నవనే సంగతి రాజకీయవాదులు మొదలుకొని దేశంలో ఉన్నటువంటి న్యాయవాదులు, న్యాయ శాస్త్ర నిపుణులు అందరుకూడ ఒప్పుకొంటున్నటువంటి విషయమే. ఒకవైపు శ్రేయోరాజ్యం కావాలనే కోరికతో, ఆశయంతో మనం ముందుకు పోతున్నాము. అటువంటి సందర్భంలో ప్రభుత్వంవారు తలపెట్టినటువంటి ఈ సవరణబిల్లు అధికంగా పన్నులు వసూలు చేసేదిగా ఉండడం ఏమి బాగున్నదనే ప్రశ్న ఉత్పన్నమైంది. ఈ సందర్భంలో ఒక విషయంమాత్రం మనవిచేస్తున్నాను. మన ఆశయం శ్రేయోరాజ్యస్థాపన. ప్రస్తుతం, మనకు ఉన్నటువంటి ఆర్థికదుస్థితి రీత్యా ఇది కేవలం వ్యాపార సరళిలో కోర్టులను మనం వాడుకోవాలనే ఉద్దేశంతో చేసిందికాదు. ప్రభుత్వానికి ఆదాయము అవసరము గనుక ఈపని చేయవలసివచ్చింది. అందుచేతనే మన ఆశయ సిద్ధినిగురించి మనము ఏమాత్రం శకించవలసినటువంటి పనిలేదు. కాని మన ఆశయాన్ని మనం వెంటనే చేరుకొనే స్థితిలోలేము. అందుచేతనే ఈ సవరణబిల్లు ద్వారా ప్రభుత్వము కొంచము ఎక్కువ ఆదాయము రావాలని కోరిందనే సంగతి స్పష్టపడుతుంది.

ఇక రెండవది, ఒక విషయంమాత్రం గట్టిగా మనవిచేయాలని అనుకొంటున్నాను. ఈ writs విషయంలో, చాలా అనుభవశాలురు, వృద్ధులు, ఈవృత్తిలో చాలా పెద్దలు అయినటువంటి గౌరవ సభ్యులు మన రమణయ్యగారు ప్రభుత్వాన్ని సంబోధింపజేసి, చాలా writs రావడంవల్ల ఎక్కువ work అవుతుందనిచెప్పారు. అయితే ఈరోజున executive power చేసేటటువంటి excesses ను గురించి ప్రాథమిక హక్కులను భారతీయులు కాపాడుకొనేటటువంటి ప్రయత్నంతో ఇన్ని writs చేయవలసివస్తుందని ఆ విదంగా నేను అర్థంచేసుకొంటున్నాను. Law యిప్పుడు ఒక process లో వుంటున్నది గాని అది యింకా settle కాలేదు. ఈ writs విషయములో అనేక విషయాలమీన తుదిపరిష్కారానికి కావలసిన తీర్పులు వస్తున్నవి. writ petitions పై Court fees ను నూరురూపాయలవరకూ పెంచడమువల్ల excesses ను check చేసుకోటానికి కావలసిన fundamental rights ఏవి అయితే వున్నవో, వాటిని నిలబెట్టుకోడానికి వీలు లేకుండా చేస్తున్నామేమోననే అనుమానం కలుగుతున్నది. ఈవిషయంలో మాత్రము ప్రభుత్వమువారు తగిన అవకాశము యిచ్చి writs వేసుకోటానికి fees ను మాత్రం తప్పనిసరిగా సవరించాలని కోరుతున్నాను. హరిజనులకు సంబంధించినంతవరకు అస్పృశ్యత ఒక cognizable offence గా మన శాసనములోనే చేసుకున్నాము. అందుచేత దానికి

SRI T. VEERARAGHAVULU

సంబంధించిన నిర్ణయములు ఏవైనావుంటే పోలీసువారే నడుపుతారు. అవిషయములో lawyers కు ఉచితముగా యివ్వవలసిన సహాయము యేమీలేదు.

ఇక పోతే ప్రతి పర్యాయమున్ను పేద ప్రజానీకము, పేద ప్రజానీకము అని మాట్లాడుతూవుంటారు. ఈ పేదప్రజానీకము అనే శబ్దాన్ని చాలమటుకు మనము తరచుగా వాడుకుంటున్నాము. ఇది ఎట్లావున్నదంటే వెఱ్ఱివాని చేతిలో రాయిలాగు వున్నది. పేద ప్రజానీకానికి సివిల్ కోర్టులకు ఏమీపనిలేదు. దిగంబర స్వాములవారికి చాకలివానితో ఎంతవరకు పనివుండదో, ఆదేమాదిరిగా పేద ప్రజానీకానికి మాత్రం సివిల్ కోర్టులతో ఎలాంటి సంబంధనుగాని, పని గాని వుండదు అందుచేత వారికి, యీకోర్టులవల్ల ఏమీబాధవుండగు. ఇక క్రిమినల్ కోర్టులలో ఈ prohibition cases అనేవి వుండడమువల్లనే, అక్కడక్కడ పేదవారు కనబడుతూవుంటారు. అందుచేత చెట్టు, చేమ లేని హరిజనులకుగాని, భూమి, పుట్రలేని పేద ప్రజానీకానికి గాని యీ న్యాయసిద్ధికోసము వ్యయపడవలసివస్తుంది, బాధపడవలసివస్తుంది, అనే slogan అంతగా నమ్మతగింది కాదు. అనుభవములోకూడ అది రుజువుఅయిందికాదని నేను మనవిచేస్తున్నాను. పంచాయితీ కోర్టులకు, పంచాయితీ రాజ్యానికి దోహదము కలుగచేసినట్లవుతుందనిన్నీ ఆవిధముగా పన్ను పెంచడము మంచిదనిన్నీ కొంతమంది సభ్యులు చెబుతున్నారు. కాని నేనుమాత్రము ఆవిధంగా తృప్తిపడేవాడిని కాదు. ఎందుకంటే, శరీరము వున్నంతకాలము రోగాలు, చావు ఏవిధముగా రాకతప్పవో ఆవిధముగానే ఆస్తిఅనేది వున్నంతకాలము తగవులు అనేవి వుండకపోవు. అందుచేత యీ తగవుల పరిష్కారానికి కోర్టులలో న్యాయసిద్ధికొరకు కోర్టులకువెళ్ళి మానవ ప్రయత్నము చేయడము అనేది వుంటూనే వుంటుంది. అందువల్ల వాటినిగురించి ఏదో వేదాంతమార్గంగా అప్పటికప్పుడు అనుకొని, యీకోర్టుకాకపోతే యింకొక కోర్టుకు పెట్టుకుందాము అని అనుకోవచ్చు. ఆవిధంగా పెట్టుకున్నతరువాత, అక్కడ అవి యింతకంటె మరింత అసంతృప్తిగా తయారవుతూవుంటాయి. అందువల్ల యీ బిల్లు మన ఆశయాలకు కొంచెము విరుద్ధముగా కన్పించినప్పటికినీ, ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా, నేను యీ బిల్లును బలపరుస్తూ writs విషయములో మాత్రము ప్రభుత్వము పునరాలోచించవలసిందిగా కోరుతూ, విరమిస్తున్నాను.

SRI M. BAPAIAH CHOWDARY:—

అధ్యక్షా,

ఈ బిల్లును మొత్తముమీద నేను బలపరుస్తూ కొన్ని విషయాలుమాత్రము నేను మనవిచేయదలచాను. మొట్ట మొదటిగా యీబిల్లును ప్రభుత్వము తీసుకొనివచ్చినప్పుడు జనబాహుళ్యానికిన్ని యిందులోవున్న బాగుఓగులు తెలియపరచి, వారియొక్క అభిప్రాయాన్ని సేకరించినట్లయితే బాగుంటుందేమోనని కొంతమంది సభ్యులు అంటున్నారు. కాని నేను ముఖ్యంగా మనవిచేసేది యేమిటంటే, యీబిల్లులోని 24, 25 వ సెక్షనులలో ఉండే declaration suits, injunction suits విషయములో కక్షిదార్లు కట్టవలసిన కోర్టు ఫీజు మాత్రము ఎక్కువగా వున్నదేమో పరిశీలించవలసిందిగా

Sri M. BAPAIAH CHOWDARY :-
మంత్రిగారిని కోరుతున్నాను. ఎందుకంటే, యీ injunction suits సామాన్యంగా వచ్చేవి ఎటువంటివి అంటే, ఒకరికి వున్నఆస్తిలో అక్రమముగా యింకొకరు హక్కు లేనివారు ప్రవేసించితే, అటువంటివారిమీద వచ్చేదావాలు ఏక్కువగా వుంటాయి. ఇటువంటి కేసుల విషయములో అక్రమముగా ప్రవేశించిన వ్యక్తియొక్క స్వాధీనములో ఆస్తివుంటే ఆయనమీద దావావేసినప్పుడు ఆయన కోర్టుఫీజుక్రింద డబ్బు ఎక్కువగా ఖర్చుపెట్టడము అనేది అంత మంచిదికాదేమోనని అంటున్నాను. బిల్లుయొక్క 24 (A) సెక్షనులోవున్నదానికి $\frac{3}{4}$ అనిగాని, 25 వ సెక్షనులోవున్న వ్యవహారానికిగాని, యిదివరకువున్న Court fees నే వుంచినట్లయితే బాగుంటుందేమోనని నాఅభిప్రాయము. ఇప్పటికి చాలారోజులుగా ఒకేరకమైన Court fees చెల్లిస్తున్నాము. కాబట్టి ఈ బిల్లుద్వారా ఒక్కసారిగా పెంచబడుతున్నప్పుడు, అది ఎక్కువగా కన్పించడము సబబైనదే. ఇప్పుడు న్యాయవాది వృత్తిచేసేవారుగాని, కోర్టులకు వెళ్లే కక్షిదార్లుగాని తాత్కాలికంగా యీకోర్టుఫీజు పెంపుదల ఎక్కువ అని కాని, చెల్లించడము కష్టముఅనిగాని కన్పించినప్పటికీ, పోనుపోను అలవాటు పడేటప్పటికి, ఇది ఒక పెద్ద భారమైన Court fees గా కన్పించదేమోనని అనుకుంటున్నాను.

తరువాత writs విషయములో మన నాయుడుగారు చెప్పినట్లు, ఒక్క బస్సుల విషయములో తప్ప, తక్కిన writ కేసులలో ఎక్కువగా న్యాయవాదులకు ఫీజు వస్తుందని అంటే. నేను ఒప్పుకోను. ఒకచిన్న ఉద్యోగియొక్క ఉద్యోగము నిర్ణయానికైనను హైకోర్టులో write కోసము ఎక్కువగా వెళ్ళవలసివచ్చింది. అలాంటప్పుడు యీ writs petitions విషయములోకూడా కోర్టుఫీజు 50 రూపాయలకు తగ్గిస్తే బాగుంటుందేమోననిగూడ ఆలోచించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను.

తరువాత, హరిజనులనుగురించి ఎక్కుగా సభ్యులు మాట్లాడుతున్నారు. కోటయ్యగారు మాట్లాడుతూ పేదవారికి forma pauperis suits దాఖలుచేయటానికి యిప్పుడు వీలున్నది అన్నారు. ఇది ఇప్పుడేకాదు. ఇదివరకుకూడవున్నది. పేదవారైన యిప్పుడు కట్టవలసింది ఏమివుండదనిఅంటే పేదవారికి నూరు, రెండువందలు, మూడు వందలు, అయిదువందలువరకూ ఆస్తివున్నప్పటికినీ, వారు పేదవారుగా declare అవుతున్నారు. కాబట్టి వారికి కోర్టుఫీజులేదు అనేది యిందులో పెట్టవలసివస్తుంది. ఇది అంత సమంజసముగాలేదని అనుకుంటాను. వీరి విషయముకూడా అలాగే తీసుకోవలెనని అంటున్నాను. అది యీస్థితిలో చేయటానికి మంచిదికాదని వెంకటేశ్వర్లుగారుకూడ ఏకీభవించి మాట్లాడినట్లుగా తెలుస్తుంది.

ఈ బిల్లు ప్రజాభిప్రాయానికి పంపటానికి యిప్పుడు టైములేదని మంత్రిగారు చెప్పారు. బిల్లులో 24. 22 సెక్షనులలో చెప్పబడిన declaration suits విషయములో మాత్రము కోర్టుఫీజు తగ్గించటానికి ఏమైన వీలుఅవుతుందేమో ఆలోచించవలసిందిగా కోరుతున్నాను. ఈ declaration suits విషయములో ఎక్కువ అనుభవముమీద చెప్పాలంటే యిది చాలా కష్టముగా వుంటుంది. ఎందుకంటే, తమ

SRI M. BAPAIAH CHOWDARY:—
స్వంతఆస్తి యితరులు అక్రమముగా ఆక్రమించుకొని వున్నప్పుడు కోర్టులకు వెళ్లవలసి వుంటుంది. అలాంటప్పుడు ఇటువంటి declaration suits విషయములోగూడ మరల ఆలోచించాల్సిన అగత్యము ఎంతైనావున్నది. కొండయ్యగారుచెబుతూ దస్తు దావాల విషయములో 50 పరసెంటు మాత్రమే పెట్టారు. యిది చాలదు, యింకా ఎక్కువగానే ఫీజు విధించాలని అన్నారు. బహుశ దత్తు దావా దాఖలుచేసే అతను అసలు ఆమనిషికి పుట్టకపోగా, ఎవరికోపుట్టి, ప్రాగ్ర్కా సేవచ్చే ఆస్తికోసము దావా వేస్తున్నాడు కాబట్టి అటువంటి దావావిషయములో యింకా ఎక్కువగానే ఫీజు fix చేయమని వుద్దేశ్యముకాబోలు. నిజానికి అతనికి ఆస్తి ప్రాగ్ర్కా వే వస్తుంది కాబట్టి, fees ఎంత నిర్ణయించినను పరవాలేదని అంటాను. [Interruption ఆస్తిలో share వస్తుందని కాబోలు.]

ఔను. ఆస్తిలో share ఏలాగైనా వస్తుంది. ఈ యాక్టు క్రిందనో లేక మరణసుంకాల క్రిందనో, ఆయనకు ఎక్కువగా ఆస్తి వస్తే, share ఏలాగైనావస్తుంది. అందువల్ల ముఖ్యంగా యీ declaration దావాల విషయములో మాత్రము పునశ్చరణ చేయవలసిందే. ప్రభుత్వము గమనించవలసిందిగా మనవి చేస్తున్నాను.

SRI M. VENKATARAJU:—
అధ్యక్షా, సోదర సభ్యులారా!

ఈ బిల్లు వాస్తవముగా మాకు సంబంధించినదికాదు. ఏదో కోర్టు ఫీజు పెంచుతున్నారు. అందువల్ల ఈవిషయము మనకెందుకు అనే ఉద్దేశ్యముతో నేను యింత వరకు మాట్లాడకుండా ఊరుకున్నాను. కాని యీబిల్లు విషయములో పెద్ద పెద్ద ఫకీళ్లుగా ఉన్న సభ్యులుకూడ మాట్లాడుతూ యీకోర్టుఫీజు పెంచినందువల్ల కక్షి దారులు నాశనము అయిపోతారు. ఇందులో మహా ప్రమాదము ఉన్నదన్నట్లుగా చెబుతున్నారు. వారి ఆవేదన అంతా చూస్తే, న్యాయమైన ఆవేదనగా కన్పించ డములేదు. కాని నేనుకూడ ఒక్క ముక్క చెప్పుదామని ఉద్దేశించి మాట్లాడు తున్నాను. మన దేశములో కోర్టులకు పోయినప్పుడు అక్కడ జరిగే న్యాయము, అక్కడి కథలు మనము చాలా వింటున్నాము. మామూలుగా కోర్టులకు వెళ్లేవారు జూదము ఆడేవారు, సానికొంపలకు పోయేవారు సర్వనాశనకారులు. కోర్టులకు వెళ్ళి గెలిచినవారు, ఓడిపోయినవారు అంతటితో అఖరు అనేసామెత ప్రతిచోట ఉన్నది. దీనికి కారణము స్టాంపు ఫీజు రెండురూపాయలు, పదిరూపాయలు, యాభై రూపాయలు అని కాదు. ముఖ్యంగా కక్షిదార్ల నాశనమునకు కారణభూతులు వకీళ్లు. వాకిళ్లముందర చక్కలు కట్టుకుని కూర్చున్నవారే. వకీళ్లే యీ కక్షిదార్లను నాశనము చేస్తున్నారుగాని, కోర్టుఫీజువల్ల ఏ కక్షిదారుడుకూడ నాశనమగుటలేదు. అందులో మన కృష్ణావతారముగారు మరీ చిత్రమైన గథలు చెబుతున్నారు. కోర్టులలో న్యాయము జరగడములేదని అంటున్నారు. ఏపార్టీ అయినను తనవద్దకు తప్పుడుకేసు వచ్చినప్పుడు, తప్పుడు సాక్ష్యము వచ్చినప్పుడు యీసాక్ష్యము మంచిది,

Sri M. VENKATARAJU:—

కాదు అని చెబితే, ఆయనవద్దకు ఎవరుగూడపోరు. "అయ్యా, నేను ఉన్నది ఉన్నట్లుగా చెబుతానని అంటే" "నీవు పనికిరావు, పొమ్మంటారు" అబద్ధము అనేది ఎంతబాగా చెప్పాలో, వారికి ముందుగా పాఠాలు రోజు రోజు బోధించికోర్టులలో చెప్పిస్తే, దానిమీద జడ్జిమెంటువస్తే న్యాయము కలుగలేదని అంటారు. ఈవిధంగా చెప్పడము ఎంతవరకు న్యాయమో నాకు అర్థముకావడములేదు, అసలు దేవుని చూడటానికి టిక్కట్టు ఉన్నప్పుడు యీస్టాంపుఫీజు కట్టుకోటానికి, జడ్జీగారు న్యాయము చెప్పటానికి సంబంధము ఏమిటో నాకు బోధపడడములేదు. మన రమణయ్యనాయుడుగారు చెప్పిందిచూస్తే, Justice అంతా పోతుందన్నట్లు, చాలా బాధపడుతున్నట్లు మాట్లాడారు అసలు న్యాయమే ప్రధానమైనదిఅయితేఒక్కరూపాయి స్టాంపుఫీజుమాత్రము ఎందుకువుండాలి? లేకపోతే రెండురూపాయలు ఎందుకు వుండాలి? మూడురూపాయలు స్టాంపుఫీజు ఉండేటప్పుడు, అది మూడు అయితేనేమి పది అయితేనేమి? అసలు యీస్టాంపుఫీజు అనేది ఉండడము తప్పా, ఒప్పా? స్టాంపు ఫీజుకు జడ్జీగారు చెప్పే న్యాయానికి సంబందము యేమిటో, ముందు మనము తేల్చుకుంటే, యేమీసంబందము లేదని తేలుతున్నది. స్టాంపుఫీజు అని అన్నతరువాత అది మూడురూపాయలు అయినా ఒకటే, పదిరూపాయలు అయినా ఒకటే, యాభై రూపాయలు అయినా ఒకటే, ఫీజు అన్నతరువాత, ఎంత ఉన్నప్పటికినీ, ఒకటే.

తరువాత, ప్రతి సందర్భములోనూ సభ్యులు ఎవరు మాట్లాడినా పేదవారని భాగ్యవంతులని. అంటున్నారు. పేదవాడైనా, భాగ్యవంతుడైనా, కోర్టులకు పోయేటప్పుడు, ఎవడైనా ఒకటే. ఈఫీజు అనేది అందరు భరించవలసిందే. ఓక ఆస్తికోసము, ఓక లాభముకోసము కోర్టులకు వెళ్లుతున్నారుగాని, కేవలము Justice కావాలని అంటే, యిందులో యేమిటి, Justice? ఇంకొకరిఆస్తి జడ్జిగారు నాకు కలిపితే, అది జస్టిసు, కలపకపోతే, జస్టిసుకాదు అని చెబుతారు. నాఆస్తి యింకొకరికియిస్తే అది అతనికి Justice. ఇందాక బాపయ్య చౌదరిగారు ఎవరో ఒక చిన్న ఉద్యోగియొక్క ఉద్యోగమువిషయములో చాలా బాధపడ్డానని అన్నారు.

చిన్న ఉద్యోగులగురించి బాపయ్యచౌదరిగారు చెప్పారు. రు. 300/- రూపాయల ఘునసబు ఉద్యోగం సంపాదించడానికి రు. 100/- లు writ fees ఇవ్వడానికి ఎందుకు బాధపడాలి? ఎవరైనా Fundamental rights కోసము కోర్టుకు వెళ్లినప్పుడు stamp fees లేదు. ఎవరికీబాదఉండదు. Srinivasa Rao మాకోటయ్యను దబాఇస్తున్నాడు. హరిజనులకు ఉండకూడదని చేనేతవారికి అన్నీ exemptions ఇవ్వమని అంటాడు. కోటయ్యగారు ఆయనకు ఈయనకు ఇద్దరు బిచ్చగాళ్లు కథలాగున్నది "యాచకో యాచకశ్శత్రుః". Exemptions అవసరములేదు. బీదవారికి పాపరు దావాలుఉన్నవి. శ్రీనివాసరావుగారు నెల్లూరులోఅన్యాయం జరిగిందిఅన్నట్లుమునసబుగారుపాపరుదావా admit చేసుకున్నారుఅన్నారు. హైకోర్టు,ప్లీడరువ్యవహారంవల్లగాని

Sri M. VENKATA RAJU :
fees పెంచినందువల్లగాని Justice పోదు. ఎక్కడకూడా బీదవారికి fees లేక judgement వ్యతిరేకం అయిందని నేవినలేదు. ఇది అంతా దేవాలయం అర్చకుడులాగ ఉంది. దీనివల్ల ప్రజలకు కష్టాలులేవు. ఇటువంటి పెడత్రోవలు పట్టించవద్దని చెపుతున్నాను. నేను విరమించుచున్నాను.

The Hon. Sri. N. SANJEEVA REDDY :—
అధ్యక్షు మహాశయా,

కోటయ్యగారు చెప్పినట్లు నేను కూడా ఈబిల్లును చదవడానికి ప్రయత్నం చేశాను. వారికి ఎంత అర్థము అయినదో కాని మంత్రిగారిగి కాబట్టి ఎక్కువ అర్థము చేసుకోవాలని కృషి చేసినాను. సెలక్టుకమిటీ రిపోర్టుచెయ్యడానికి కారము opposition వారు కోరేరనికాదు. ముఖ్యముగాను నేనుబాగా అర్థముచేసుకుందామని సెలక్టుకమిటీకి పంపించాను. అందులో హౌసులో ఉన్నవారందరిసలహా పొందాలని నాఉద్దేశం, నాకు తెలుసునని, ఎవరు చెప్పవలసిన అవసరం లేదనికాదు. అందరిని వేసుకొనలేకపోయినాము. పెద్దల సలహాలుపొంది, వారు ఏది సవ్యము న్యాయము అనిచెపితే అది అంగీకరిద్దామని ఈ బిల్లును సెలక్టుకమిటీకి పంపినాము అక్కడ వారి వాదనలన్నీ విన్నాం. కాంగ్రెసు పంక్షంటారే ఎక్కువ తీవ్రముగా విమర్శించారు. అది మిత్రులకు తెలుసు. కమ్యూనిస్టులుకూడా అక్కడ ఉన్నారు. సవరణలను బలపరచి బిల్లుకు ఈరూపాన్ని కలిగించడానికి ప్రతిపక్ష సభ్యులు బాగా సహకరించారు. కాబట్టి ఇది ఒక పార్టీ దృక్పధముతో చేసినదికాదు సెలక్టుకమిటీ చర్చించి సభ్యులు దానిని అక్కడ బలపరచినారు. దివి కొండయ్యగారు, లక్ష్మీనారాయణరెడ్డిగారు ఈవిషయమై చెప్పినారు. శ్రీ సుబ్బారావుగారు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు చెప్పిన విషయములకు సమాధానము చెప్పాలి.

శ్రీ సుబ్బారావుగారు 20 లక్షలు అదనపు ఆదాయం వస్తుందిఅన్నారు. Stamp Duty అంతాకలిసి 20 లక్షలు లాభం వస్తుందంటే చాలాపొరపాటు. కోర్టులవల్ల మిగులుఆదాయము లేదు. వచ్చేది పదిలక్షలు అనుకొన్నాముగాని తక్కువగా వస్తున్నది. మనం ఆశించేది రాకపోగా మనకు లోటు పెరుగుతూవుంది. ఇప్పుడు వచ్చే 10, 15 లక్షలతో బ్రంహాండమైన కార్యక్రమము సాగిద్దామని మా ఉద్దేశముకాదు. Separation of Judiciary వల్ల ఎక్కువ ఖర్చు అగుతున్నది. ఇది మనము అంగీకరించిన సిద్ధాంతము. దానిని అతిత్వరలో అములుపరచవలెను అని అనుకున్నాము. ఈ సంవత్సరం తూర్పుగోదావరిలో అమలుపరచాలని అనుకున్నాము. లెఖలుచూస్తే సెపరేషనువల్ల ఖర్చులు ఎక్కువ అయినాయి. Separation recommend చేసినకమిటీ వారు లాభము వస్తుందని అంచనావేసి చేసినారు మద్రాసులో. కాబట్టి మరొకతూరి పరిశీలన చేద్దామని మరోసంవత్సరంవరకు వాయిదావేశాము. ఏప్రయత్నంచేసినా మొదట estimate వేసినప్పుడు దానిలో లాభము వస్తుందని అంచనాలువేస్తారు.

Sri. N. SANJEEVA REDDI :—

తరువాత పరిశీలనచేసి practical గా, realistic గా enforce చేసినపుడు అనుకున్న దానికన్న ఎక్కువనష్టంవస్తుందిఅని తెలుస్తుంది. ఈ వచ్చే 10. 15 లక్షలతో చెయ్యవలసిన కార్యక్రమం Judiciary లో ఇంకా ఎన్నో ఉన్నాయి. ఆఫీసర్లకు residences, కోర్టులకు బిల్డింగుల గురించి, ఇతర వాటినిగురించి హైకోర్టులు వ్రాస్తునేఉన్నారు. కాబట్టి ఇది లాభందృష్ట్యా చేసిందికాదు. మరో పర్యాయము క్రిష్ణావతారంగారు మాట్లాడుతూ దానిని ప్రజాభిప్రాయానికి పంపలేదని, ఒక్క Bar Association కైనా పంపలేదని అన్నారు. కాని దాని పూర్వచరిత్ర వారికి తెలియదు. మద్రాసులో దానిని పూర్తిగా పరిశీలన చెయ్యడానికి Special Officer ను వేస్తే వారు బాగా పరిశీలనచేసి, అభిప్రాయాలు తీసుకొని దీనికి రూపం ఇచ్చారు. హైకోర్టునుకూడా consult చెయ్యాయడం జరిగింది. హైకోర్టును అడగకుండా చేసినదికాదు. రెవెన్యూ బోర్డును, హైకోర్టును consult చేసి వారి opinion తీసుకున్నారు. అపరిస్థితులలో మనకు సెపరేషను వచ్చింది మద్రాసువారు గడిచిన సంవత్సరం శాసనము చేసినారు. అప్పుడే ఈబిల్లును తెద్దామా, వద్దా అనుకున్నాం. గడచిన సంవత్సరం అసెంబ్లిలో జరుగుతుండిన తర్జనభర్జనలవల్ల ఈబిల్లునుకోరలేదు. ఇప్పుడు ఆలోచించి చెయ్యవలసిన కార్యక్రమము గురించి ఈబిల్లు మీముందుకు తీసుకోరాబడింది. ఎవరిని అడగకుండా రివెన్యూబోర్డునుగాని, హైకోర్టునుగాని అడగకుండా, ప్రజాభిప్రాయం తెలిసుకొనకుండా, ఎవరైనా ఒక ఆఫీసరును వేసి కష్టనష్టాలను తెలుసుకొనకుండా తొందరపాటుతో చేసినపనికాదు. నేను ఈ విషయాన్ని కృష్ణావతారంగారికొరకు చెబుతున్నారు.

Writ petitions ను గురించి చాలామంది మిత్రులు చెప్పారు. Habeas Corpus దరఖాస్తులకు రెండు రూపాయలుమాత్రమే రుసుముగా ఉంచాము. ఎంత మాత్రం హెచ్చుచేయలేదు. వ్యక్తి స్వాతంత్ర్యానికి భంగంవచ్చినాసరే, మరేఇబ్బంది వచ్చినాసరే తగురక్షణ కలిగించడానికి ఉద్దేశింపబడిఉన్న Habeas corpus దరఖాస్తుపై రుసుమును హెచ్చించి ఎవరినో ఇబ్బందిపెట్టాలని ఉద్దేశముతో మేము అనుకోలేదు. ఆకారణంచేత మేము రెండురూపాయలను రెండురూపాయలుగానే ఉంచాము. ఏవ్యక్తికైనా ఇబ్బందికలిగినప్పుడు హైకోర్టును move చేసి రెండురూపాయలతో రక్షణ కల్గించుకొనవచ్చును. Writ petitions ఎందుకు వస్తున్నవో నాకు తెలుసును. మునిసిపాలిటీలలో ఎన్నికల ఫలితాలను ప్రకటించకుండా writ వాడుతున్నారు. No confidence పెట్టి Chairman ను remove చేస్తే writ ద్వారా Chairman గా continue అవుతున్నారు. ఎన్ని వేల రూపాయలో ఖర్చుపెట్టి ఎలెక్షన్సులో వచ్చిన సభ్యులలో అధికసంఖ్యాకులు వద్దనిచెప్పినాసరే Democracy ని కాలదన్ని writ ద్వారా Chairman గా Chairman అయినవారు లేకపోలేదు. చిన్న దానికి పెద్దదానికి writ లు వేస్తున్నారు. 4000 writs ఉన్నవి నేడు. అందులో పేదవారివి 400 కూడా ఉండవు. పేదవారు ఎవరు వేస్తున్నారు, writ లు ? పేదవారికి కావలసినది తిండి గుడ్డ. అవి లేక వారు బాధపడుతున్నారు. మనం పేదవారి పేర ప్రతి చిన్నదానికి ఉపన్యాసాలు చెయ్యడం పొరపాటని అనిపిస్తుంది.

Sri N. SANJEEVA REDDI :—

writ petition లు వేస్తున్నవారు కొంతమంది Political గాను, మరొకరకంగాను ఉన్నారు. ఉద్యోగస్తులకు కొంత ఇబ్బంది కల్గినప్పుడు Writ లు వేస్తున్నారు. వేస్తే 6, 7 సంవత్సరాల తరువాత Writ sanctjon చేసి ప్రభుత్వం 60, 70 వేలు ఇచ్చుకోవలసిన పరిస్థితులు ఉన్నాయి. Proper గా enquiry జరుగలేదనో, ఇచ్చిన నోటీసులో తేది తప్పుగా ఉందనో notice యిచ్చినప్పుడు పూర్తిగా explanation చదవకుండా ఆర్డరు వేశారనో ఏదో కారణమువల్ల Writ లు వెయ్యడము, అవి సంవత్సరాల పర్యంతము జరగడము జరుగుతూఉంది. ఈపరిస్థితులలో కోర్టురుసుము 100/- లు చెయ్యడం అంత ఇబ్బందికరంకాదు, Habeas corpus 2/- ఉంచినాము కాబట్టి అని Seleet కమిటీవారు అభిప్రాయపడ్డారు. ఈ చేసిన మార్పులన్నీ ఏకగ్రీవము అయిన మార్పులని చెప్పవలెనుగాని దాదాపు ఏకగ్రీవముగా చేసినవే. ఎక్కువ కష్టాలు కలిగే పరిస్థితులను మేము మానుకున్నాము. Immovable property లకు సంబంధించిన దావాలలో market value ను ఆధారంగా తీసుకొని పూర్తి మొత్తంమీద రుసుము చెల్లించాలని Original Bill లో ఉంది. మీరుచూస్తే ఉంటారు. సెలక్టు కమిటీలోసగము వెలపైననే fee చెల్లించాలని కొందరు అభిప్రాయపడ్డారు. కొందరు అటు, కొందరు ఇటు ఉన్నా యోగ్యులైన తెలివైన Advocates సెలక్టు కమిటీలో వాదించుకొన్నారు. నేను ఊరుకున్నాను తుదకు వారే నిర్ణయానికివచ్చి రాజీగా ½ కు అంగీకరించారు. ఇక adoption విషయంలో valuation ఎంతతీసుకోవలెనో మిత్రులు బాపయ్యగారు చెప్పారు. కొండయ్యగారు చెప్పారు. వాస్తవముగావారు కష్టపడలేదు, శ్రమపడలేదు, తండ్రి సంపాదించలేదు, ఎక్కడోవస్తుంది, అంతోఇంతో ఎక్కువ ఇస్తేనష్టం ఏమిటి, ముప్పుఏమిటి అని అన్నారు. స్వంత ఆస్తిలోనే తండ్రి చనిపోయినపుడు Death Duties వగైరా ఇస్తున్నారుకదా, ఈనాడు ఎక్కడనూ సంబంధంలేకుండా ఎక్కడనుండో వస్తు ఉంటె 10/- 25/. రూపాయలు కోర్టుకు, ప్రభుత్వానికి ఇస్తేఏమిపోయింది? ఎక్కడా పన్ను వేయకూడదు, Justice అంతా cheap గా ఉండవలెను, అన్ని cheap గా ఉండవలెను, complete గా సున్నా free గా ఉంటే ; ఇంకా మంచిదేఅంటే, పరిపాలన కొనసాగించడం ఎలాగో తెలియజేయ గోరుతున్నాను.

ఇలాంటి సిద్ధాంతాలతో ప్రభుత్వం నడపడం సాధ్యంకాదు. ఆలోచించేటప్పుడు dogmatic గా కూర్చుని ఏవో అనుకున్నాం, చేస్తేగాని వీలులేదనే సిద్ధాంతంతో పోలేదు. Select Committee వేసినప్పుడు ఏదో వాళ్ళు చెప్పినట్టు వినాలనే సిద్ధాంతాన్ని కూడా అమలుపరచడంలేదు.

చాలమంది పెద్దలతో ఆలోచించిన తరువాత సలహాపొందినతరువాత యివన్నీ చర్చించాం. కాబట్టి యిక్కడ యింత చర్చ జరుగుతుందని అనుకోలేదు. మిగిలిన details లోకి పోదలచుకోలేదు, Clauses వస్తాయి, Clauses మీద చర్చ వచ్చినప్పుడు Select Committee లో ఆలోచించిన విషయం ఏదైనా తేగలిగితే

Sri N. SANJEEVA REDDI :-

దానిని మళ్లీ పరిశీలనచేస్తాం. Select Committee లో ఆలోచించనిదానిని ఒత్తిడి చేసి మీరు press చేయడమేజరిపితే మేము అంగీకరించడం చాలాకష్టం అప్పుడు మాదృష్టికి రానట్టి విషయాలు అనుభవజ్ఞులైన లాయర్లయిన సభ్యులు తెలియజేస్తే వున్న యిబ్బందులకు relief యివ్వవచ్చు. Select Committee లో ఆలోచించ లేదని పొరపాటుచేశారని చెప్పగలిగితే దానినిగురించి ఆలోచిస్తాం. ఇప్పుడు మీరు వెంటనే consider చేయడానికి అంగీకరిస్తూ clause by clause సమ్మతించవలసినదిగా కోరుతున్నాను.

Mr SPEAKER :—The question is :—

"That the Andhra Court-fees and Suits Valuation Bill. 1955, be taken into consideration."

The motion was carried and the Bill was taken into consideration.

Sri Vavilala Gopalakrishnayya:—Madras Act ను adopt చేశాము అన్నారు. మాదగ్గర ఆ Act యొక్క copy లేదు. అందువల్ల information ఏమయినా యిస్తారా?

The Hon. Sri N. SANJEEVA REDDY :—

రెండూ దగ్గరపెట్టుకునే Select Committee లో అక్కడక్కడ మార్పులు చేస్తూవచ్చాం. దాదాపు basis అదే. In to గా copy చేయలేదు. కాని basis మాత్రం అదే.

Mr. SPEAKER : We shall commence from clause 4.

Clause 4 was put and carried.

*Clause 5.*

Mr. SPEAKER :—The motion is :
"That clause 5 do stand part of the Bill."

Sri S VEMAYYA:—
Sir, I move :
"In line 5 delete the words 'at any time'"
The amendment was duly seconded.

Mr. SPEAKER:—

I want to know the purpose in asking the deletion of the words 'at any time'. Does the hon. Member mean by it, 'in the first instance' or 'the first presentation of the document'?

Sri S. VEMAYYA:—

'At any time' అన్నప్పుడు "ముందుగాకూడా" అని అర్థం చెప్పే అవకాశంకూడా ఉన్నది. At any time అనే పదం పోయినట్లయితే అఖరున 'at the final stage' అనే అర్థానికి అనుగుణంగా మరొక సవరణయిచ్చాను. At any time అనే మాటలు వేసినప్పుడు మధ్యలోగాని, మొదట్లోగాని, fees వసూలు చేసే బాధ్యత ప్రభుత్వానికి తప్పిపోతుంది, కాబట్టి "At any time" తొలగించాలని అనే మాటలను మనవిచేస్తున్నాను. తరువాత final stage లో realise చేయాలని మరొక సవరణ అంగీకరించాలని నాప్రతిపాదన. మొదట్లో fees కట్టవలసివుంటే బాధగావుంటుంది. అఖరున కట్టడానికి సంతోషంగా కడతారు. అందువల్ల యీ సవరణ ప్రతిపాదిస్తూ దానిని ఒప్పకోనవలసినదని సభవారిని కోరుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI ·—

ఇది అంత serious గా ఎందుకు తీసుకొన్నారో నాకు తెలియదు. It is a simple thing. It is a matter of convenience.

SRI S. VEMAYYA: I beg leave of the House to withdraw the amendment moved by me.

The amendment was, by leave of the House, withdrawn.

Clause 5 was put and carried.

Clause 6 was put and carried.

*Clause 7*

Mr. SPEAKER: The motion is:

"That clause 7 do stand part of the Bill."

Sri. S. VEMAYYA: Sir, I move:

'Delete the word 'market' wherever occurs."

Sri S. VEMAYYA:—

అధ్యక్షా, ఇప్పుడు వాదిగాని ప్రతివాదిగాని value ఇంతఅని తెలియజేస్తారు. తరువాత court వారికి అఖరున సరిఅయిన విలువ నిర్ణయించే హక్కువున్నది కాబట్టి Market value అనేది vague గా వుంటుంది. కాబట్టి market అనే పదాన్ని తగ్గించవలెనని నాఅభిప్రాయము.

The amendment was duly seconded.

The Hon. Sri N. SANJEEVA REDDI :—

I entirely agree with Mr. Vemayya that the courts must have discretion. But there must be some basis for the court fee.

SRI S. VEMAYYA :—

Sir, I beg leave of the House to withdraw my amendment.

The amendment was, by leave of the House, withdrawn,

Clause 7 was put and carried.

Clause 8 was put and carried.

*Clause* 9.

Mr. SPEAKER :— The motion is :

"That clause 9 do stand part of the Bill."

SRI S VEMAYYA: Sir, I move:

"For the word 'highest' substitute the word 'lowest'."

SRI D V. SUBBA RAO : Sir, I second the amendment.

అధ్యక్షా ! ఈ Court fees Bill అనేది fiscal enactment క్రింద వస్తుంది. Fiscal enactments ను interpret చేసేటప్పుడు 'Subject' కు అనుకూలంగానే అర్థము చెప్పవలసియున్నదని High court తీర్పులు ఏకగ్రీవంగావున్నాయి. అందుచేత దావా ఒక అగ్రిమెంటుక్రిందవస్తుందా లేకపోతే pronote క్రింద వస్తుందా లేక Bond క్రింద వస్తుందాఅంటే ఆ వ్రాతలోవున్న మతలబ్ నుబట్టి దేనిక్రింద తక్కువ court fees ను charge చేయడానికి వీలుఔతుందోయని క్రిందనే charge యవలసియున్నదని ఇదివరకున్న ఏకగ్రీవ అభిప్రాయాన్నిబట్టి amendment యివ్వవలసివచ్చింది. హెచ్చు court fees కట్టనవసరంలేకుండా తెలివితేటలతో document వ్రాయబడినదనిభావించి ఎక్కువ court fees వసూలుచేయాలనే ఉద్దేశము State కు వుండకూడదని తెలియజేస్తున్నాను. వ్రాసిన పత్రముయొక్క మతలబును ఆధారంగాతీసుకొని court fees ను నిర్ణయించవలసినదేగాని కేవలం అధికఆదాయార్జననే దృష్టిలోనుంచుకొనరాదని మనవిచేస్తున్నాను. అందువల్ల హైకోర్టుల అన్నింటియొక్క ఏకగ్రీవమైన అభిప్రాయాన్ని పురస్కరించుకొని పెట్టిన సవరణ ఇది. దీనిని సభవారు ఆమోదిస్తారని అనుకుంటాను.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

దీనినిగురించి Select Committee లో చర్చచేసినతర్వాతనే యీవిషయాన్ని ఆలాగే loose గా వదలిపెట్టడంద్వారా చాల నష్టమురావడానికి అవకాశముంటుంది. కాబట్టి చట్టసమ్మతంగా రావలసిన fees కూడా పోతుందనే ఉద్దేశంతోనే ఈవిధంగా చేయబడింది.

Mr. SPEAKER : The question is,

"For the word 'highest' substitute the word 'lowest'."

The amendment was lost.

Clause 9 was put and carried.
Clause 10 was put and carried.

*Clause 11*

Mr. SPEAKER :— The motion is:
"That clause 11 do stand part of the Bill."

Sri S. VEMAYYA:—

Sir. I move:
"Delete sub-clause 1 (b) of clause 11."

SRI D. V. SUBBA RAO:—

Sir, I second the amendment.

అధ్యక్షా,

యీ సవరణ చాలఅవసరము. The decision of the court under clause (A) regarding the proper fees payable shall be subject to the review అని క్లాజులో ఉన్నది. తరువాత from time to time by the same court' అనే మాటలుండడంవల్ల చాల దారుణమైన పరిస్థితులకు కారణమౌతుంది. ఒకమాటు నిర్ణయించినతర్వాత మళ్లీ ఆకోర్టే ఒక రెండునెలలు ఐనతర్వాత ధర తగ్గినదంటూ చెప్పి ఎవరైనా petition పెట్టితే, లేక ఆయనఅంతట ఆయనకే తోచినట్లైతే మళ్లీ enquiry పెట్టుతూవుండడమూ, మళ్లీ కమిషన్‌ను పంపించడమో లేకపోతే ఒక pleader ను కమీషనర్‌గా వేయడము జరిగితే ఆదావాకు finality అనేది వుండదు. ఈవిషయం ఇదివరకే నేను మనవిచేసివున్నాను. ఏలాగంటే ఒక మునిసిఫ్ గారున్నారు. ఆయనదగ్గర ఒక దావా రెండేండ్లదాకా అలాగే వుండిపోతుంది ఆయన transfer ఐ వెళ్లిపోయినట్లయితే, యీ Court Fees question మీద మళ్లీ ఏ Sub-court కో transfer ఐయ్యేటట్లుగా ఈ suit విలువ border line మీద ఉన్నది కాబట్టి విచారించడం . . . . .

The Hon. SRI N. SANJEEVA REDDY :—

Sir, the Select Committee has omitted the words 'further review' and changed the clause on the suggestion of the Member Evidently Mr. Subba Rao has forgotten it.

Mr. SPEAKER.—

I invite the attention of the hon. Member to clause 7 which says: "Save as otherwise provided, where the fee payable under this Act depends on the market value of any property, such value shall be

Mr SPEAKER:—

determined as on the date of presentation of the plaint. " So the bar is already there, the court-fee examiners sent by the High Court examining and saying that more fee should be collected.

Sri. D. V. Subba Rao:—

దానివల్ల ఒక అనిశ్చితమైన పరిస్థితి ఏర్పడుతుంది. ఎప్పుడు పడితే అప్పుడు వారు దానిని increase చేయడానికి వీలుగావుంది. దానివల్ల Court Fees ఎంత చెల్లించాలో ఎప్పుడు ఎక్కువౌతుందో అనే అనుమానము కల్గుతుంది. ఎక్కువ మళ్లీ appeal దీనివల్ల Court Fees question మీదనే అసలు దావా తేలకుండా పోతుంది. కాబట్టి from time to time అనే అనధికారాన్ని Court కు తీసి వేయడం మంచిది. ఆదిలో దావా పడవేసినప్పుడు Office దానిని check చేస్తుంది. దావా వచ్చిన తర్వాత ప్రతివాది జవాబుఇచ్చిన తర్వాత statement of objections విన్నతర్వాత కావలసివుంటే ఆquestion settle చేయవచ్చునుగాని ఆదిలోనే Court fees యొక్క ఎక్కువ, తక్కువల కారణంగా దావా పైవిచారణను వాయిదా వేయడం సబబుకాదు. ఒక petition ఎవరైనా పెట్టినతర్వాత Court fees మార్పు చేస్తూవుండమంటే దానికి finality వుండదు కాబట్టి నా సవరణ చాలా అవసరమని మనవి చేస్తున్నాను.

The Hon. SRI N. SANJEEVA REDDI:—

ఇదేమీ క్రొత్తదికాదు. మీరుచెప్పినట్లు ఇంతకుముందున్న అధికారమే. ఏమీ క్రొత్తదిగా సృష్టించబడినదికాదు. ఏదో Judge గారి నోటీసుకువస్తే మరికొంచెము Fees హెచ్చించడానికివున్న అధికారమే ఇక్కడవుంచారు కాని క్రొత్తగా ఏర్పాటుచేసినదికాదు. కాబట్టి దానిని మార్పుచేయాడము అనవసరమని అనుకుంటున్నాను.

Sri S VEMAYYA:—

ఇక్కడ from time to time అంటే ఒకసారి suit పడ్డతర్వాత ఒక మూడు మాసాలకు వేయిరూపాయలది 4 వేల రూపాయలకు అమ్మాడని దానిని మళ్లీ revise చేయమనిచెప్పి అందులో మళ్లీ తగవురావచ్చును.

Mr. SPEAKER:—

అది సాధ్యముకాదు.

Sri. D. KONDAIAH CHOWDARY:—

Suit లో వున్నదానినిబట్టే అసలు value నిర్ణయిస్తారు. ఆ value సక్రమమైనదా కాదా? అనేది documents వల్ల తేలితే దానిని review చేస్తారేకాని value ను బట్టి మార్చడానికి వీలులేదు. ఆ suit ను present చేసిననాడు ఏ విలువ వుంటుందో దానిమీద ఈ market value నిర్ణయించాలి. ఆరోజువుండే విలువను

Sri D. KONDAIAH CHOWDARY :—

గురించి ఒక అభిప్రాయానికివచ్చి ఏదైనా నిర్ణయిస్తారు. దానిమీద ఏదైనా further documents వలన విలువనిర్ణయం చేసినది తప్పావుంటే దిద్దుకోడానికి కోర్టు అవకాశము యిచ్చారు. ఇది క్రొత్తదికాదు.

Mr. SPEAKER:—

ఇదివరకు Defendant వాదనుచేయడమువల్ల suit యొక్క valuation మార్చేవారుకాదు. కాని ఇప్పుడు defendant యొక్క వాదనువల్ల suit యొక్క value మారుతుంది.

Mr. SPEAKER :— The question is:

"Delete sub-clause 1 (b) of clause 11."

The amendment was lost.

Sub-clause (1) was put and carried.

*Sub-clause (2)*

Mr. SPEAKER :—

There is an amendment in the name of Sri Vavilala Gopalakrishnayya: "Delete the words 'not properly valued in lines 8 and 9, and 'the suit is not value in accordance' in lines 13 and 14 of the sub-clause. It involves the question of Jurisdiction.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :—

I am not moving it, Sir,

Sri D. V. SUBBA RAO :— Sir, I move:

"In clause 11, sub-clause (2) delete the words 'before the hearing of the suit.'"

Sri S. VEMAYYA :—

Sir, I second the amendment.

Sri D. V. SUBBA RAO :—

అధ్యక్షా, సాక్ష్యం తీసుకోకుండానే Settlte చెయ్యాలి అంటే సాధ్యంగాని దావాలు చాలావున్నాయి. Undivided interest వున్న person ఎవరన్నా వున్నట్టు అయితే యీ Judgement debtor అసలు petition లో వున్నాడా? లేదా? అనేదానినిబట్టికాని, అసలు యెంత కోర్టుఫీజు చెల్లించాలో తేలదు. Fieed Court fee చెల్లించాలా? లేకపోతే Advoloren చెల్లించాలా value share మీద చెల్లించాలా అప్పుడుగానీ తేలవు, evidence తీసుకుంటేనేగాని. అందుచేత ముందే తేల్చాలనే విషయం సాధ్యంకాదు. దావా తేలినప్పుడే ఆ issue మీదకూడా

Sri D. V. SUBBA RAO :—

ఫైండింగుయిస్తే చాలాబాగుంటుంది. కాని మొట్టమొదట యీదావా యింకా సాక్ష్యం తీసుకోకుండానే Court fee issue మీద decision ఇవ్వాలనడం సబబుకాదు. ఇది appealable decision. Civil procedure code ప్రకారం right of appeal వుంది దానిమీద. అందుచేత దీనిమీద అప్పుకు వెళ్లుతూకూర్చుంటే అసలు దావా పడుకుంటుంది. దావా మెరిట్సుమీద decide కాకుండా narrow point మీద 3 కోర్టులు తిరగడం జరుగుతూవుంటుంది. అందుచేత యీ పాయింటు మొట్టమొదటే settle చెయ్యాలని చెప్పడంలో సబబు యేమీలేదు. అందుకోసం 'before the hearing of the suit అనేమాటలు తీసివేయవలసిందని కోరుతున్నాను.

Mr, SPEAKER :—

**Then, the whole clause has to be changed.**

The Hon. SRI N. SANJEEVA REDDI·—

హియరింగుఅంతా అయిపోయినతర్వాత అవతల కోర్టుఫీసు డిస్పైడుచేస్తే యేమి లాభంవుంది? మొదలే దీనివిషయం చర్చించుకొంటే తర్వాతకావలిస్తే యీ point మీద అప్పీలుచేసుకోవడానికి వీలవుతుంది. ఇది major issue.

Sri. PILLALAMARRI VENKATESWARULU.—

ఈ point మీద అప్పీలుచేసేటప్పటికి నంబరుపడదు. High court దాకా పోతుంది. 4 నెలలు, 5 నెలలు ఆలశ్యంఅవుతుంది.

SRI. KONDAIAH CHOWDARY :—

అధ్యక్షా, అన్ని విషయాలు చర్చించినతరువాతనే Select committee వారు ఈక్లాజును సవరించారు. శ్రీ సుబ్బారావుగారు కోరినట్లు "before the hearlng of the Suit" అనే మాటలు తొలగించినట్లయితే "as contemplated" అనే మాటలుకూడా తీసివేయాల్సి వస్తుంది. యేమి అట్లా తీసివేస్తేను? "All questions arrising on such plea shall be heard and decided" అని మాత్రం నిలబడిపోతుంది. "shall be heard and decided" అంటే ఎప్పుడని ? యే పరిస్థితుల్లో అని ?. ఆ క్లాజుకు అర్థమేలేకుండాపోయింది. కనుక నేను ఈ సవరణను వ్యతిరేకిస్తున్నాను.

**The present procedure is, a suit is numbered and court fee is collected before a final decision is given. According to the present Bill, court-fee is to be collected before a suit is numbered.**

Sri S. K. V. KRISHNAVATHARAM ;—

I do not think so. Any defendant may plead that the subject-matter of the suit has not been properly valued and the proper fee has not been collected.

Mr. SPEAKER·—

Please see the last sentence of the clause "........... if the deficit fee is not paid, the plaint shall be rejected..."

SRI S K. V. KRISHNAVATHARAM :—

There is no bar. In a preliminary decision, the court-fee may be decided and if the party does not pay, the plaint may be rejected. But there is no bar to the numbering of a plaint.

Mr. SPEAKER·—

In that case, the whole clause will have to be deleted.

The Hon SRI N. SANJEEVA REDDY :—

We provided this at the instance of the Select Committee. Also the amendment would not fit in.

Sri PILLALAMARRI VENKATESWARLU·—

ఒక Clarification కూడా కావాలి. ఇప్పుడు ఉండేటటువంటి Practice కు మనం suggest చేస్తున్నటువంటి Practice కి తేడా వున్నదేమో తెలియజేయ గోరుతాను.

Mr. SPEAKER :—

ఉంది.

SRI D. KONDAIAH CHOWDARY ·—

Hearing అనేపదానికి Explanation గా "as contemplated by rule 18" అనే మాటలు చేర్చబడినవి. కాని ఇందులో విపరీతమైనది ఏదీ లేదు.

Mr. SPEAKER :—

Yes, the amendment will not fit in.

Sri D. V. SUBBA RAO :—

Sir, I beg leave of the House to withdraw my amendment.

The amendment was, by leave of the House, withdrawn.

Sub-clause (2) was put and carried

SUB-CLAUSE (3)

Mr SPEAKER. There is an amendment in the name of Sri Vavilala Gopalakrishnayya for adding at the end of the Sub-clause that the debtor cannot be committed to Civil Jail. I am ruling it out of order.

Sri P. BASI REDDI:- Sir, there is no provision for the arrest of defaulter of even land revenue.

Mr. SPEAKER: Even today it is being collected as arrear of land revenue.

The Hon SRI N. SANJEEVA REDDI: అధ్యక్షా, Decree అయిన మొత్తము ఇవ్వకపోతే వాళ్లు కోర్టుకు పంపించుకోవడమో. ఏదో చేస్తారు. We have nothing to do with that here. Court fees ఇవ్వకపోతే ఏమిచేయాలనేదే ఇక్కడవున్నది. Court fees ఇవ్వకపోతే Land Revenue ఎట్లా వసూలుచేస్తామో అట్లా వసూలు జేయాలని దీంట్లోవున్నది. డబ్బు యివ్వవలసినవాడు ఇవ్వకపోతే, వాడిని జైలుకు పంపుకుంటారో ఏమో? అదివేరేసంగతి.

Sub-clause (3) was put and carried.
Sub-clause (4) was put and carried.
Clause 11 was put and carried.
Clauses 12 to 18 were put and carried.

Mr. SPEAKER:— Clause 19 will be taken up later.
Caluse 20 was put and carried.

CLAUSE 21

Mr. SPEAKER:— The motion is:
"That clause 21 do stand part of the Bill."

Sri D. V. SUBBA RAO:—
Sir, I move:

"For the words 'for three - fourths of the market-value of the property', substitute the words 'fifty times the assesment in respect of wet lands and lands growing purely commercial crops, and twenty times the assessment in respect of dry lands".

Sri S. VEMAYYA:—
Sir, I second the amendment.

THE ANDHRA COURT FEES AND SUITS VALUATION BILL, 1955
(AS AMENDED BY THE SELECT COMMITTEE)

Sri D. V. SUBBA RAO:-

అధ్యక్షా! ఇది ఈబిల్లుఅంతటిలో ముఖ్యమైన Clause. అందువల్ల సభ్యులందరు దీనిని గమనించాలని నా ప్రార్థన. ఆస్తి స్వాధీనమునకు దావా వేసినట్లయితే ఆస్తి కిమ్మత్తులో 3 వంతులుమీద court fees చెల్లించాలని ఇప్పుడు ఈ బిల్లులో ఉన్నది. ఇది చాలా దారుణంగా పెంచబడిందని నా అభిప్రాయము. అసలు ఈ కిమ్మత్తు అనేది నిర్ధారణ చేయడానికి వీల్లేనటువంటి విషయము. భూమియొక్క కిమ్మతు కట్టడానికి ఒక విస్పష్టమైన ప్రమాణాలులేవు. ధరలు ఒక తాలూకాలో ఒక విధంగాను, మరొక తాలూకాలో మరొకవిధంగాను ఉంటాయి. ఇంకో తాలూకాలో ఇంకో విధంగా ఉండవచ్చును. ఒకచోట ధరలు ఎక్కువగా వున్నకాలములో ఆర్థిక దుస్థితివల్ల ఒకతను భూమి అంతా తక్కువకు అమ్మకొంటూ వుంటే ఇద్దరు పెద్దవాళ్లు పోటీపడి ఎక్కువ డబ్బు పెట్టి కొనుక్కొనవచ్చును. ధర నిర్ణయించడానికి ఒక నిర్ణీతమైన ప్రమాణములేదు. కాబట్టి మనము court fees సరిగా చెల్లించాలని నిర్దిష్టంగా ఒక assessment పెట్టినట్లయితే బాగుంటుందిఅని మా సూచన. Assessment అంటె ఏమో కొండయ్యచౌదరి గారు చెప్పారు. 100 ఏండ్లు క్రిందట Assessment ను fix చేశారు. ఇప్పుడు ధరలు ఎక్కువ అయినాయి కాబట్టి assessment ను basicగా పెట్టుకొని దీనిపై increased "number of times" court fees వేయవచ్చును. Assessment ను basic గా తీసుకొని court fees ను విధించి చేసినట్లయితే ఎంత చెల్లించాలో ప్రతివాదికి తెలుస్తుంది. అంతేకాని market value అనడముతో ధరలను నిర్ణయించడములో ఎవరికే ఆధారము కన్పించడములేదు. ఈ ధరలు time ను బట్టి మారుతూ ఉంటాయి. అందువల్ల ఆ విధంగా నిర్ణయించడములో చాలా యిబ్బందులున్నాయి. ఏదైనా ఒక ఇల్లు ఉన్నదంటే దానికి మునిసిపాలిటీవారు పన్ను విధిస్తున్నారు. దానిమీద ఏదో rent వస్తుంది అంటున్నారు. దానిపై "20 times" అని capital value కట్టుతున్నారు. దీనిమీద మునిసిపాలిటీ assessment చేస్తున్నారు. మన court fees వసూలు చేసేందుకుకూడా assessment ను basis గా తీసుకున్నట్లయితే clear గా వుంటుంది అని ఒక standard మనము అవలంబించినట్లు అవుతుంది అని నా అభిప్రాయం. కోర్టులకు వెళ్లే వారిలో అత్యధిక సంఖ్యాకులు గ్రామీణులు. 3/4 market value పైన court fees విధించాలనడం వాళ్లమీద దుర్భరమైన భారముక్రింద పరిణమిస్తుందని మనవిచేస్తున్నాను. అందువల్ల భూమి శిస్తుపై 50 రెట్లు లెక్కకట్టి court fees విధించడం సబబుగా ఉంటుందని మనవిచేస్తున్నాను. లేకపోతే "60 ఇంతలు, 70, ఇంతలు" అని అనుకోవచ్చును. లేనిచో court fees ఎంత కట్టవలెనో తెలియక రైతులు బాధపడవలసి వస్తుందని మనవి చేస్తున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI:-

అధ్యక్షా! దీనినిగురించి సెలక్టుకమిటీలో చాలాసేపు చర్చించాము. అసలు Original Bill లో పూర్తి value తీసుకోవాలని ఉన్నది. 5 వేల రూపాయలకు

ఎవరు అయినా కోర్టులో దావావేస్తే ఈ మొత్తానికి వారు court fees కట్టాలి. పత్రిం మొదలైనవాటిపైన దావావేస్తే 100కి ఇంతని వారు court fees కట్టాలి. ఒక పట్టణములో ఎవరైనా ఇల్లు కట్టుకుంటే, ఆ ఇంటిపైన ఏదైనా తగాదావస్తే విచారించేందుకు పూర్తి fees ఎందుకుఇవ్వకూడదు? ఇప్పుడు బిర్లాఅనే ఆయన పెద్ద factory కట్టుకున్నాడు అనుకోండి దానిమీద ఎవరుఅయినా దావావేస్తే దానికి ఎందుకు fees ఇవ్వకూడదు? Immovable property మీద market value ను ఆధారంగా తీసుకొని పూర్తిమొత్తంమీద court fee చెల్లించాలని మొదట అనుకున్నాము. ఆ ఉద్దేశ్యంతోనే మొదట బిల్లు వ్రాశారు. కాని ఇది hardship అవుతుందని అందరము కలిసి చర్చించాము. కొందరుసభ్యులు market value లో సగముపైగానే court fee విధించాలని కోరారు. Compromise గురించి 3/4వంతు పెట్టుకుందాము అని agreement కు వచ్చి దానిని ఇక్కడకు తెచ్చాము. మరల దానిపై ఇక్కడ మొదలుపెట్టి చర్చప్రారంభిస్తే ఇందులో తెగేది ఏమీవుండదు. కాబట్టి ఈ3/4valuationను అందరూ అంగీకరించాలని కోరుతున్నాను.

Mr. SPEAKER. The question is.

"For the words 'for three – fourths of the market value of the property', substitute the words 'fifty times the assessment in respect of wet lands and lands growing purely commercial crops, and twenty times the assessment in respect of dry lands."

The amendment was lost.

Sri GOTTUMUKKALA JAGANNATHA RAJU: Sir, I move:

"For the words 'three-fourths', substitute the words 'two-thirds'."

అధ్యక్షా! Select Committee stage లో ఈ clause మీద చాల discussion అయింది. ఆరంభంలో Treasury Benches లో ఉన్నవాళ్ళుకూడ నన్ను support చేసి full market value మీద stamp duty collect చేయడం న్యాయంకాదని చెప్పారు. కొంత discussion అయిన తరువాత, ప్రత్యేకంగా సంజీవరెడ్డిగారు ఉండడముచేతను నేను alternative ఒకటి propose చేశాను. Two-thirds అయితే బాగుంటుందనే alternative propose చేశాను. అప్పుడు సంజీవరెడ్డిగారు ఒప్పుకోవడానికి సిద్ధంగావున్నారు. సరిగా వారు ఒప్పుకొనే సమయములో వాళ్ళ follower ఒకడులేచి మేము three-fourths అయితే ఒప్పుకుంటామని అన్నారు. సంజీవరెడ్డిగారు యీ నాsuggestion ఒప్పుకోవడానికి he was almost agreed at that stage. కాని అప్పుడు సరిగా వారి followers ఒకరు నిలబడి అలాకాదు, three-fourths ఒప్పుకొంటామని అన్నారు. అప్పుడు నామాట ఎవరైనా వింటారా?

అప్పుడు three-fourths అని మిగతావారుకూడ అనడంచేత దానిని unanimous గా అంగీకరించినట్లు తీసుకొన్నారు. అది న్యాయముకాదు. కనుక నా సూచనను ఇక్కడ మరొకతూరి తమతో మనవిచేస్తున్నాను. Original Bill తో compare ఇది చేసినట్లయితే (as recommended by the Select Committee) ఇది ten times increase అయింది. ఇది ఏమీ న్యాయంగాలేదు. దీనివల్ల బీదవాళ్ళు చాలా affect అవుతారు. ఈ ఒక్క provision మీదే నేను amendment అడుగుతున్నాను. After all the difference is 10 percent. ఇదేమీ అంత హెచ్చులేదు. At least ఇంతమట్టుకైనా బీదవాళ్ళకోసం చేయవలసిందని నేను వారిని ప్రార్థిస్తున్నాను.

The amendment was duly seconded.

Sri S. RANGANATHA MUDALIAR:

Sir, my friend Sri K. Venkataramanayya Naidu Garu was telling yesterday that there was no principle in having three-fourths of the market-value and that either they should have it at full market value or they should not have it. That is a reasonable argument and still more unreasonable is to reduce it to two-thirds. Ultimately, Sir, I think we can have the full market value.

Sri D. KONDAIAH CHOWDARY:-

Mr. Speakar, Sir, ఇది increase చేసేటప్పుడు విషయాలన్నీ చాలదీర్ఘంగా చర్చించారు. Money suits లో ఏమో full value వేస్తున్నాము. House property మీద పూర్తి చెల్లిస్తున్నాము. తరువాత garden lands మీదను పూర్తి చెల్లిస్తున్నాము. భూమికిస్తుమాత్రము different గా ఉండినది. అందువల్ల వాటిని మాత్రము అట్లేఉంచి, ఇప్పుడు భూమిమీదమాత్రము 50 percent చేయడం బాగా లేదని, differentiate చేసినట్లు అవుతుందని అనుకున్నాము. Houses కూడ immoveable property యే. Gardens కూడ immoveable property యే. అటువంటప్పుడు ఒక immoveable property కి ఒక value ను, మరొక immoveable property కి మరొక value ను వేయడం, distinction చూపినట్లుగా అర్థమవుతుంది. కాబట్టి అన్నిటికీకలిపి ఒకటే value వేయాలని అనుకున్నాము. కాని వారు (జగన్నాధరాజుగారు) ఒక lands మీదనే two–thirds అంటే ఒప్పుకోలేదు. అన్నింటిని సమన్వయం చేసేదానికొరకు 75 percent ను ఒప్పుకొన్నాము. అదీ జరిగినసంగతని మనవిచేస్తున్నాను.

Sri S. K. V. KRISHNAVATHARAM:-

అధ్యక్షా ! Three–fourths of the market value పెట్టడంవల్ల చాలా ఇబ్బంది కలుగుతుంది. ఎందువల్లనంటే ఇప్పుడు Munsif Court కు అయిదువేలవరకు కూడ మీరు jurisdiction create చేసినప్పుడు పశ్చిమగోదావరి జిల్లాలో, తణుకు

తాలూకాలో ఎక్కువైనాసరే రెండు యెకరాలగురించి litigation వచ్చినట్లైతే, అది Sub-court కు వెళ్లవలసిన పరిస్థితి వస్తుంది. కాబట్టి three-fourths of the market value చాలా ఎక్కువగా ఉన్నది. వారు ఏదిచెప్పినప్పటికిని half of the market value కు తగ్గించవలసిందని నేను కోరుతున్నాను. ఈ విధంగా తగ్గించకపోతే చాలా యిబ్బందులు కలుగతాయి. ఎందువల్లనంటే beyond the jurisdiction of the Munsif కు ఏమాత్రము claim ఉన్నప్పటికీ, కొద్దిఆస్తి అయినప్పటికీ సరే, valuable lands ఉన్నచోట ఇబ్బంది వస్తుంది. ఇందాక మనవిచేశాను. ఇప్పుడు Munsif Courtకు 5 thousands వరకు jurisdiction ఉన్నది. దానివల్ల కొద్దిఆస్తికి three-fourths of the market value పెట్టడంవల్ల, అది Sub-court కు వెళ్లవలసిన పరిస్థితి వస్తుంది. కాబట్టి half the market value కు తగ్గించవలసిందని కోరుతున్నాను. మద్రాసులో market value కు పూర్తిగా ఉన్నమాట నిజమే. మనము యింకా three-fourths కు తగ్గించాము. కాని simultaneous గా కొన్నింటిలో తగ్గించినటువంటి, కొన్నింటిలో హెచ్చించినటువంటి Acts ఉన్నాయి నాదగ్గర. అయినప్పటికీ half the market value పెట్టవలసిందని నామనవి. ఇంకేదో చెప్పారు ఒక Factory నో ఇంకేదో ఒకచోటనవుంటే, ఇంకొకడువచ్చి దాంట్లో చేరుకుంటారు. Next year he will have a hold over. దానికి what is the remedy? Factory లక్షరూపాయలు అయినట్లైతే ఆ factory when it is affixed to the earth, it becomes immoveable property. ఆ లక్షరూపాయలమీద ఒకకాని రాదు. ఈ ఇబ్బందులన్నీ చూడాలి. Especially ఇప్పుడుమనము transitional period లో వున్నాము. బీదల స్వాధీనములో ఉన్నభూమినికూడ భాగ్యవంతుడు కలుపుకొంటాడు. బీదవాడు దావావేయాలంటే అభ్యంతరాలు వస్తాయి. కాబట్టి మనము కొంచెము liberal గా ఉంటె మంచిదని, కనుక దీనిని అంగీకరించ వలసిందని విజ్ఞప్తిచేస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA: Sir, I move:

"For the words 'three-fourths', substitute the words 'one-half'."

ఒకవేళ దీనికి గవర్నమెంటు amendement తీసుకొని వస్తామంటే నేను press చేయను. నా అభిప్రాయముకూడా సగముచేస్తే న్యాయంగా ఉంటుందనే. కనుక ఆ విధంగా చేయవలసిందని చెప్పుచున్నాను.

The amedment was duly seconded.

The Hon. Sri N. SANJEEVA REDDI:-

మొదట full గా ఉండాలనే అనుకొన్నాము. కాని ఏదో compromise క్రింద

చేయాలంటే, ఒక దాంట్లో తగ్గించాము. మరొకదాంట్లో ఎక్కించాము. Garden landకు fullగా ఉన్నది తగ్గించాము. Agricultural landsకు half ఉంటే దానిని three-fourths చేశాము. Therefore we tried to strike an average. వారు ఏదో ఒక రకంగా సర్దుకోవడానికి ఆ విధమైన రాజీ అయింది. ఆ రాజీ చేసిన పొరబాటు ఇప్పుడు అర్థమవుతూంది. మొదలియార్ చెప్పినట్లు ఇప్పుడు కావాలంటే పూర్తి పెట్టేస్తాము. We shall treat everything equally కాని ఇప్పుడు సవరణ press చేయడమనేది బాగలేదు. ఇదేమైనా చర్చించకుండా ఉండి పొరపాటుగా చేసింది అయితే "We have brought new facts to light" అని చెప్పినప్పుడు నేను అంగీకరిస్తాను. కాని ఈ విషయంలో బాగా తర్జన భర్జనలు అయిన తరువాత ఒక రాజీకివచ్చి ఇప్పుడు దాన్ని break చేయడం మంచిది కాదని చెప్పుచున్నాను.

Mr SPEAKER. The question is·

"For the words 'three - fourths' substitute the words 'two thirds'."

The amendment was lost.

Mr SPEAKER. The question is

"For the words 'three - fourths', substitute the words 'one - half',"

Sri Vavilala Gopalakrishnayya and Sri B. Rathnasabhapatih Setty demanded a poll and the House divided thus.

AYES

1. Sri Vavilala Gopalakrishnayya
2. Sri B. Rathnasabhapathi Setty.
3. Sri B. Audinarayana.
4. Sri G. Suryanarayana.
5. Sri Pillalamarri Venkateswarlu.
6. Sri S. Vemayya.
7. Sri A. Venkatrama Raju.
8. Sri G. Yellamanda Reddi.
9. Sri D. V. Subba Rao.
10. Sri B. Sankaraiah.
11. Sri G. Nageswara Rao
12. Sri V. Visweswara Rao,

13. Sri P. Satyanarayana
14. Sri Gottumukkala JagannadhaRaju.
15. Sri S. Kasi Reddi.
16. Sri S. Seetharamayya.
17. Sri Mahammed Tahseel
18. Sri M. Nagi Reddi.

NOES

1. Hon. Sri N. Sanjeeva Reddi.
2. Sri P. Ranga Reddi.
3. Sri Vijaya Bhaskara Reddi.
4. Sri Kalluru Subba Rao.
5 Srimathi C. Ammanna Raja.
6. Srimathi B. Rukmini Devi.
7. Sri G. Bapaiah.
8 Sri M. Bapaiah Chowdary.
9. Sri P. Bapayya
10. Sri P. Basi Reddi
11. Hon. Sri D. Sanjivaiah
12. Hon. Sri A B. Nageswara Rao.
13. Sri S. Brahmayya
14. Sri N. Chenchurama Naidu.
15. Sri N P. Chengalraya Naidu.
16. Sri Marupilli Chitti alias Appalaswamy.
17. Sri V. Gopalakrishna.
18. Sri T. Gopalakrishnayya.
19. Sri S. B. P. Pattabhi Rama Rao
20. Sri P. Thimma Reddi.
21- Sri P. Gopalu Reddi.
22. Sri P. Gunnayya
23. Sri P. Gurraju
24. Sri M. Harischandra Prasad.
25. Sri S. Jagannadham.
26. Sri Divi Kondaiah Chowdary.
27. Sri Pragada Kotaiah.
28 Sri M. Koti Reddi
29. Sri T. Lakshminarayana Reddi.
30. Sri N. K Lingam.
31. Sri Mahammad Rahamatullah Shaik.
32. Sri E. Nagaiah.

33. Sri M. Pallam Raju.
34. Sri P. Rajagopal Naidu.
35. Sri N. Ramabhadra Raju.
36. Sri T. Prakasam
37. Sri M. Rajeswara Rao.
38. Sri D. Ramabrahmam.
39. Sri T. Ramachandra Reddi.
40. Sri Kunda Ramaiah.
41. Sri G. Ramaswamy Reddi.
42. Sri A Rathnam.
43. Sri P. Anthony Reddi.
44. Sri Raja Sagi Suryanarayana Raju.
45. Sri N. Srinivasa Rao.
46 Sri A. C Subba Reddi.
47. Sri Shaik Moula Saheb.
48 Sri Challa Subbarayudu.
49. Sri T Veeraraghavulu
50. Sri K. Venkatramanayya.
51. Sri D. Venkataramana Reddi.
52. Sri G. Venkata Reddi.
53. Sri P. Venkatasubbaiah.
54. Sri R. Latchapatrudu
55. Sri B. Venkatasivayya.
56. Sri Kasim Venkata Reddy.
57. Sri B. Appa Rao.
58. Sri P. Narasimhappa Rao
59. Sri C. V. Suryanarayana Raju.
60. Sri P Suryanarayana.
61. Sri S Ranganatha Mudaliar

Ayes : 18; Noes; 61.

The amendment was lost.

Clause 21 was put and carried.

CLAUSE 22.

Mr. SPEAKER: The motion is:—

"That clause 22 do stand part of the Bill."

